# భారతి

సాహిత్య మాసపత్రిక

మార్చి: 1990 వెల : 5 రూపాయలు



* వైశాఖేశ్వర ఆలయ నిర్మాత
* ద్రావిడార్య భాషల్లో సంస్కృతము
* శేషేంద్ర భావచిత్ర భంగిమలు
* బాపిరాజు సాహిత్యం
* తెలుగు దున్నపోతు
* తాగుబోతు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# అమృతాంజన్ గ్రైప్ వాటర్






పాప ఆరోగ్యానికి,
సంతోషానికి దివ్యామృతం

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు, విరేచనాలవంటి బాధలు వెంటనే తగ్గిపోతాయి. ఆకలి, జీర్ణశక్తి బాగా వుంటాయి పాపాయి ఆరోగ్యం బాగుపడుతుంది

**అమృతాంజన్ లిమిటెడ్**
42-45, లజ్ చర్చ్ రోడ్డు,
మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

# భారతి


మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 67 మార్చి 1990 సంచిక : 3

విడిపత్రిక వెల ఐదు రూపాయలు


## విషయానుక్రమణిక

# స్వవిషయం

నేటి ద్రావిడార్య భాషల్లో సంస్కృతం ఎంతవరకు ప్రవేశించినదీ-ఏ మేరకు ప్రభావితం చేస్తున్నదీ - ఈ నెల భారతిలో - ఆచార్య జాస్తి సూర్యనారాయణగారు వివరించడానికి ప్రయత్నించారు. భాషా పరిశోధకులకు ఈ వ్యాసం ఆసక్తికరంగా ఉండగలదు. డా॥ విజయదత్తాత్రేయ శర్మగారు వైశాఖేశ్వర ఆలయ నిర్మాత ఎవరు అని ప్రశ్నిస్తూ - ఆంధ్ర విశ్వవిద్యాలయానికి చెందిన 'సాగరగర్భ పురావస్తు అధ్యయన కేంద్రం' వారు వెలుగులోకి తెచ్చిన ఎన్నో విశేషాలను - ఈ మాసం భారతిలో అందించారు. ఈ వైశాఖేశ్వరుని పేరు మీదగనే విశాఖపట్నం పేరు వచ్చి ఉండవచ్చునని చరిత్రకారులు కొంతమంది అంటున్నారు కూడా. అయితే ఈ విషయం ఇప్పటికీ చర్చనీయాంశమేనని వ్యాసకర్త అభిప్రాయ పడుతున్నారు.

బాపిరాజు సాహిత్యంలోని అన్యదేశ్యాల గురించి డా॥ సిమ్మన్నగారి వ్యాసం ఒకటి ఈ సంచికలోనే చోటు చేసుకుంది. సాహిత్య కృషీవలురకు ఇలాంటి వ్యాసాలు ఎంతయినా రుచికరంగా ఉండగలవనడంలో ఎవరికీ సందేహం ఉండదు.

ఇలాగే శేషేంద్ర కవితల్లోని భావచిత్ర భంగిమల గురించి డా॥ పెన్నా శివరామకృష్ణగారు అందించిన వ్యాసం కూడా సాహితీ సుగతులను బాగా ఆకర్షించగలదని అనుకోవడంలో అత్యుక్తేమీ ఉండదు. ప్రకృతిని ప్రతీకాత్మకంగా దర్శించి చిత్రించడం వలన అనుభూతి "అక్షరమైన అభివ్యక్తి"ని పొందగలుగుతుందని వ్యాసకర్త అభిప్రాయపడటం సమంజసంగానే తోస్తుంది.

ఈ సంచికలో అందిస్తున్న కవిత్వం ఆధునికాంధ్ర సాహిత్యానికి ఒక సంకేతం అనుకోవచ్చు. రకరకాల భావచిత్రాలు వింత వింతైన పోకడలను ప్రదర్శించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఈ నెల అందించిన కథ తాగుబోతు ఇది శ్రీ. శే. జయశంకర ప్రసాద్‌గారి రచన. మనిషికి మనిషికి మధ్యన ఏర్పడే అనుబంధం ఎంత సున్నితంగా ఉంటుందో- ఎంత ప్రగాఢంగా ప్రభావితం చేస్తుందో - ఈ కథ కొద్దిగానైనా తెలుపుతుంది.

నిజం చెప్పాలంటే ఒకరకంగా ఈ సాహిత్యమంతా జీవితమే! కాని ఈ జీవితమంతా సాహిత్యం కాలేదు.

# మనిషి మండే సూర్యుడు కావాలి!

ఈ జనారణ్యంలో -
మెదళ్ళని, కళ్ళని,
చేతుల్ని, కాళ్ళని - బంధించి
దగా చేయడం - దోచుకోవడం
స్వార్థం చెందిన నక్కలకు
కుళ్ళు ముదిరిన తోడేళ్ళకు - పాత ఆటే!
ఆవేశాల ఆరని చిచ్చులను
నేత్రాల పంజరాల్లోకి నెట్టేసి - స్మశానంలా కనబడటం-
ఆవేదనల నీలి మొయిళ్ళను
గుండెల ఎడారుల్లో కట్టేసి-సమాధిలా నిలబడటం-
ఇక్కడ - ఈ మనిషికీ పాత అలవాటే!
నిలువునా దోపిడీ జరుగుతున్నా తలరాతంటూ-
సర్దుకుపోవడం కాదు - జీవితమంటే!
ఆకాశాన్నంటే అగ్నికెరటమై నిలబడటం!
సముద్రాన్ని గొంతులో నింపుకొని గర్జించటం!
చెమట చుక్కల అమృతాన్ని జుర్రుకొనే
జలగల పీకల్ని పిసికే ఉక్కు పిడికిలి కావటం!

ఈ చీకటి నరకంలో
మనిషి మండే సూర్యుడు కావాలి!
వణికే చేతికి ఊతగా నిలవాలి!
నిట్టూర్చే నీతికి ఓదార్పుగా మారాలి!
ఆశగా తలెత్తి చూచే తిగెలకు,
నిరాశలతో కుమిలే మొగ్గల గుండెలకు
ప్రాణవాయువు లూదాలి!
వేదనల తెరలు కమ్ముకున్న కళ్ళలో
ఆశల వెన్నెల వెలుగై నిండిపోవాలి!
ప్రతి మనిషి-
అగ్నిశిఖల కిరీటం దాల్చిన సవితలా కదలాలి!
అక్షరాల మెరుపుల్ని తొడుక్కున్న కవితగా బ్రతకాలి!!

శ్రీ భువనగిరి నాగరాజు

# ఆ రోజులు

ఆ రోజులు ఎంత అందమైనవి
జీరాడే పరికిణీలు గిరగిరమని తిరిగినపుడు
పువ్వుల వలె గొడుగుల వలె
రివ్వున విప్పారినట్టి.... ఆ రోజులు....

చెమ్మచెక్కలాడు వేళ
చెల్లా చెదరౌచు మరల
చేరువగా ముందు కురికి
చేయి చేయి కలిపినట్టి.... ఆ రోజులు....

ఉయ్యాలల ఇరువంకల
ఉవ్వెత్తుగ ఊగినపుడు
క్రొత్త క్రొత్త కోర్కెలెవో
గుండెలలో గుబులుకొన్న.... ఆ రోజులు....

మళ్ళీ ఆ రోజుల కోసం
మరో జన్మ మరో జన్మ
అలా ఎన్ని జన్మలైన
ఎత్తాలని అనిపించే.... ఆ రోజులు....

కాని ఒకే భయం భయం
కదులుతున్న కలికాలపు
దానవతకి ఎర నాదని
మానవతని మరచెదనని,

కాని, ఎపుడు మరువలేని
మరపురాని మరువబడని.... ఆ రోజులు....

కాదు కాదు మరల మరల
మానవతని నిలబెట్టే
దానవతని అరికట్టే
ధైర్యంతో దార్ఢ్యంతో
జన్మిస్తా జన్మిస్తా
జయిస్తాను జయిస్తాను
ఆ రోజులు....!

శ్రీ వజ్ఝల కాళిదాసు

డా॥ ఎం. విజయదత్తాత్రేయ శర్మ

# వైశాఖేశ్వర ఆలయ నిర్మాత ఎవరు?

ఇటీవలే, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఏర్పడిన 'సాగర గర్భ పురావస్తు అధ్యయన కేంద్రం' 'వైశాఖేశ్వర ఆలయం' ఉనికి, విశేషాలను వెలుగులోనికి తీసుకు రావడానికి పూను కొన్నది.[1]

ఈ పరిణామం సాగరగర్భ పురావస్తుశాస్త్ర (మెరైన్స్ ఆర్కియాలజీ) వేత్తలకే గాక సామాన్యులకు కూడ విశేషాసక్తి కరమైనది. ఇటువంటి అన్వేషణా ప్రయత్నం ఆంధ్రప్రదేశ్‌లో ప్రప్రథమం. ఈ దశ(శా)బ్దాంతానికి అంతర్జాతీయ స్థాయికి ఎదగగలిగిన పాటవం కలిగిఉన్న విశాఖపట్టణానికి పేరిచ్చిన వైశాఖేశ్వరాలయం నిర్మాత ఎవరనే విషయం కొంత చర్చించదగి ఉంది.

పైన పేర్కొనబడిన 'సాగరగర్భ పురావస్తు అధ్యయన కేంద్రం' పండాలకులొకరు విశాఖేశ్వర ఆలయ నిర్మాత కులోత్తుంగ చోళుడని అభిప్రాయపడటమూ[2], కొందరు ఆ అభిప్రాయాన్ని పూర్వపక్షం చేయడమూ జరిగింది [3]

పైవారు పై విధమైన అభిప్రాయాన్ని ఏర్పరుచుకోవ డానికి చాలవరకు 'పైౖమరి సోర్సెస్'ను పరామర్శించక 'సెకండరి సోర్సెస్'పై ఆధారపడటమే కారణమనిపిస్తుంది. ఈ సందర్భాన్ని పూర్తిగా అవగతం చేసుకునేటందుకు ప్రాతిపదికగా సందర్భ సహితమూ, పూర్వోక్తమూ అయిన వ్రాతలను ముందుగా పరిగణనలోనికి తీసుకోవాల్సి ఉంది.

"వైశాఖ యను శబ్దము నుండి విశాఖపట్టణమను నామ ముత్పన్నమైనది."[4]

వైశాగ్‌పటాం అనుదానికి విశాఖపట్టణము సువ్వరూప మనియు అనగా విశాఖ దేవాలయము కలిగియున్నదనియు 'విశాఖ మండల చరిత్రము'లోని వ్రాత.[5] ఈ విషయాన్నే మరికొంచెం వివరంగా 'విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము' ఇలా పేర్కొన్నది. "వైశాగపటం అను నామమునకు విశాఖపట్టణ మనునది సుశబ్దమై యున్నది. అనగా కార్తికేయ స్వామియొక్క పట్టణమని తాత్పర్యము. కులోత్తుంగ చోళుడను నొకరాజు సుమారు అయిదువందల సంవత్సరముల క్రిందట శ్రీ కాశీయాత్ర వెళ్ళుచూ ప్రస్తుత విశాఖపట్టణ ప్రదేశమందు మకాం చేసి ఆ స్థలమును చూసి యాయన సంతోషించి లాసన్ సుబె అను సముద్రమునకు దక్షిణ భాగమందు తీర్థపురాళ్ళు అని పిలువబడు స్థలముయొద్ద వారి జాతమున కిష్టదేవత యయిన కుమారస్వామి నిమిత్తము ఒక ఆలయము కట్టించెను."[6]

సుమారు వంద సంవత్సరాల క్రితం, అందునా చరిత్ర గ్రంథంగా కాక సమాచారార్థమై పైగా ఆంగ్ల రచనకు అనువాద ప్రాయమైన గ్రంథంలో అనుశృతంగా వస్తున్న కథనం పేర్కొనబడినదని సరిపెట్టుకోవచ్చును. అయితే, కులోత్తుంగ చోళునికి విశాఖపట్నానికి అసలు చుట్టరికం లేకుండా పోలేదు. ఆ కథామీమాంసకన్నా ముందర కీ.శే. బులుసు వేంకట రమణయ్య గారి వ్రాత గమనించవలసి ఉంది. వారు విశాఖపట్టణానికి ఆ పేరు స్కందునిపరంగా వచ్చిందని రాస్తూనే ఈస్టిండియా కంపెనీ వారి కాలంలో వ్యాపారం ప్రధానవృత్తిగా గల ఆ కంపెనీ విశాఖపట్నంలో తమ వ్యాపారాన్ని, గిడ్డంగులను రక్షించు కోవడం కోసం అక్కడ నిలిపి ఉంచిన సైన్యంలో సిపాయిలు చాలమంది విశాఖదేవుని భక్తులు కావడంవల్ల ఆ చిన్న బస్తీలో సముద్రతీరాన ఆ దేవునికి ఒక చిన్న గుడికట్టి పూజించేవారని కాబట్టి విశాఖపట్టణమనే పేరు వచ్చిందని వ్రాయడం జరిగింది.[7]

విశాఖపట్నంతో ఆంగ్లేయుల వర్తక సంబంధం **1634** సం॥లో ప్రారంభమైనా అక్కడ వారి ఫేక్టరీ **1682** సం॥లో ప్రారంభమైంది.[8] ఈ లెక్కన సుమారు అయిదు వందల సంవత్సరాల క్రితం విశాఖ సముద్రతీరాన ఆలయం వెలసినదనిన ఆంగ్లేయ సమాచార గ్రంథాల మాట రైటే అయినా అది కులోత్తుంగచోళుని కాలంతో సరిపోదు.

కులోత్తుంగ చోళుని కాలానికి పూర్వమే విశాఖపట్టణ ముండినట్లు శాసనాలు సాక్ష్యమిస్తున్నవి.

శ. సం. 990 (క్రీ.శ. 1068) నాటి ద్రాక్షారామ భీమేశ్వర దేవాలయమున గల శాసనమొకటి 'విశఖ పట్టణన'మునకు చెందిన

కోమటి యొకడు శ్రీ భీమేశ్వర మహాదేవరకు అఖండవర్తి, లోహ దివియ పెట్టిన వైనాన్ని తెలియజేస్తోంది.[9] అంటే నాటికే విశాఖపట్నం ఒక వ్యాపార కేంద్రంగా ఉండి ఉన్నదన్నమాట.

శ. సం. 101(3) అనగా క్రీ.శ. 1090-91 సం॥నాటి విశాఖపట్టణములోనే లభించిన శాసనమొకటి శ్రీమతు విశాఖపట్టణమైన కులోత్తుంగచోళ పట్టణమును పేర్కొన్నది.[10]

ఆయా సాక్ష్యముల నాధారముగా చేసుకొనియే "క్రీ.శ. 1083 ప్రాంతమున కులోత్తుంగుని సేనానియైన కరుణాకరుడు విశాఖపట్టణమును స్వాధీనపరచుకొని దానికి కులోత్తుంగచోళ పట్టణమని పేరిడినాడు" అని కొందరు చరిత్రకారులు వ్రాయడం జరిగింది.[11]

పై శాసన నిరూపణల వలన విశాఖపట్టణ నామమునకు గాని ఆ నామమేర్పడుటకు కారణమైన విశాఖేశ్వరాలయముతో గాని కులోత్తుంగునికి సంబంధము లేదను విషయము స్పష్టమైనది.

**ఇక, తదాలయ నిర్మాత లెవరై యుందురన్నది ప్రశ్న?**

వారెవరైన గాని స్కందుని, కుమారస్వామి, మహాసేనుని భక్తులు, పాదానుధ్యాతులు కావల్సియున్నది.

తమ పేరునగాని, పూర్వీకుల, పాలకుల పేర్లమీదుగా గాని, తమ బిరుదుల పరంగా గాని ఈశ్వర ప్రతిష్ఠలు కావించినవారు ఆంధ్రదేశ చరిత్రలో చెప్పుకోదగినంతగా కానవస్తారు. ఈ సాంప్రదాయానికి ప్రథమోదాహరణగా రేనాటిచోళ మహాదేవి (7వ శతాబ్ది) వసన్తిపోతి తన పేరిట వసన్తీశ్వరుని ప్రతిష్ఠాపించుటను పేర్కొనవచ్చు.[12] తూర్పు చాళుక్య రెండవ విజయాదిత్యుడు నరేంద్ర మృగరాజను తన బిరుదపరంగా అనేక నరేంద్రేశ్వరాలయములను నిర్మింపజేశాడు.[13] కాకతీయుల కాలంలో ప్రోలేశ్వర, బేతేశ్వర[14], రుద్రేశ్వరాది[15] ఆలయములు వెలిసినవి.

ఆంధ్రదేశమున అధికారము నెరపిన రాజవంశాలలో స్కంద నామధేయులు కొందరున్నారు. శాతవాహనులలో మత్స్య పురాణ ప్రకారం వరుసగా 5, 11, 26వ పాలకులుగా పేర్కొనబడిన స్కందస్తంభి, స్కందస్వాతి, శివస్కందులను వాయుపురాణమసలు పేర్కొనలేదు. కడపటి శాతవాహన రాజుల సామంతుడుగ నొక స్కందనాగుడు కానవస్తున్నాడు. శౌరి పల్లవులలో ఒక స్కందమూలుడు ముగ్గురు స్కందవర్మలు ఉన్నారు. 4-5 శతాబ్దుల కాలంలో పశ్చిమ గోదావరి జిల్లా ప్రాంతమును ఏలిన శాలంకాయనులలో నందివర్మ, స్కందవర్మ నామధేయులు కానవస్తారు. ఇట్టి పేర్లు శివ, కుమారస్వాముల పారమ్యాన్ని తెలియజేసేవే అయినప్పటికీ శాలంకాయనులు చిత్రరథస్వామి పాదానుధ్యాతులు. వారు విశాఖ ప్రాంతంలో స్కందుని ఆలయ నిర్మాతలు కావడానికి వారి రాజ్య విస్తీర్ణ పరిధులు కూడ ఆటంకంగా ఉన్నవి. ఇక గుప్త చక్రవర్తులలో స్కంద గుప్తుడున్నాడు గాని అతడు ఉత్తరాపథానికే పరిమితమైనవాడు. తూర్పు చాళుక్యులు తాము మహాసేన పాదానుధ్యాతులమని చెప్పుకున్నారు. తూర్పు చాళుక్య రెండవ యుద్ధమల్లుడు తమ కులదైవమైన కుమారస్వామికి ఆలయం నిర్మించాడు. పేరుకు తగ్గట్టుగానే నిత్య యుద్ధాలతో బ్రతుకు గడపిన అతడు దేవసేనానికి ఆలయం నిర్మించడం తగిఉన్నదే గాని అతని అధికారం అనిశ్చితంగా సాగినది గావున విశాఖ ప్రాంతాలలో స్కందాలయ నిర్మాణానికి వీలు కలిగినది కాదు.

సముద్రగుప్తుని దక్షిణ దిగ్విజయ యాత్రానంతరము కళింగాంధ్ర ప్రాంతమున వెలసిన చిన్న రాజ్యములలో సింహపురము (నేటి సింగుపురం, శ్రీకాకుళం జిల్లా) ఒకటి. ఆ రాజ్యపాలకుల నామధేయములు ఉమవర్మ (కళింగాధిపతి), అచండవర్మ, నంద(ది) ప్రభంజనవర్మ (సకల కళింగాధిపతి) అనునవి శైవమత సంబంధమును సూచించునవి. వారి శాసనముద్రికలపై 'పితృభక్త' అను పదము ఉన్నది. శాసన లిపినిబట్టి వారు నాలుగవ శతాబ్దపు చివరను, అయిదవ శతాబ్దపు పూర్వార్ధమునను రాజ్యమేలినట్లు భావింపబడుతోంది. అట్లే లిపిని బట్టి క్రీ.శ. అయిదవ శతాబ్దికి చెందినటుల తోచుచున్న ఒక తామ్రశాసన మిచ్చిన శత్రుదమనుడు అను రాజునకు కూడ పితృభక్త వంటిదేయగు 'భట్టారక పాద పరిగ్రహీత' అను విశేషణము కానవచ్చుచున్నది. ఈయన రాజధాని కూడ సింహపురమే.

పై వారుగాక అయిదవ శతాబ్ది పూర్వార్థమందు కళింగాంధ్ర ప్రాంత పాలకులలో నొకడు విశాఖవర్మ నామధేయుడు కానవస్తున్నాడు. ఇతడు తన రాజ్య సంవత్సరము ఏడవ యేట హేమంత ఋతువులోని ఏడవ పక్షమున ఇరువదవ దినమున తన తండ్రి పుణ్యార్థము గాన కొరాసోటక పాంచాలిలోని టాంపాయక

అను గ్రామమును విష్ణుశర్మ, శ్రేష్ఠిశర్మ, అగ్నిశర్మ, నాగశర్మ, శివశర్మ అను అయిదుగురు ఆత్రేయ గోత్రజులగు బ్రాహ్మణులకు దానముగా ఇచ్చిన తామ్రశాసనము లభించినది.[16] ఆ శాసనములో ఇతడు బప్పభట్టారక పాదభక్తుడని విశేషించి చెప్పబడుట అందుకు తగినట్లుగానే ఉన్నది. శాసనలిపిని బట్టి మాతర కులజుడైన శక్తివర్మ కంటె ముందుండినవాడని తోచుచున్నది.[17] కాబట్టి క్రీస్తుశకము 4వ శతాబ్దము నాటివాడని ఎంచవచ్చును. ఇతని రాజధాని 'శ్రీ'పురము. అది నేటి శ్రీకాకుళం జిల్లాలో గల సిరిపురము (పాలకొండ, సోంపేట, చీపురుపల్లి తాలూకాల)లలో నేదేని కావచ్చును. ఇతడు తన రాజ్యమును అశ్వమేధ, రాజసూయములు నిర్వహించిన విష్ణుకుండిన మొదటి మాధవవర్మ వలన గాని, కళింగములోనివాడే అయిన వాశిష్ఠ గుణవర్మ వలన గాని, శైలోద్భవుల వలన గాని యుద్ధములలో కోల్పోయి ఉండవచ్చునని బి. వి. కృష్ణారావుగారి అభిప్రాయం.[18] ఇట్టి యుద్ధములలో చిక్కుకొనియుండిన ఇతడు మహాసేనుని, దేవసేనాని, యుద్ధాదినాథుడూ ఐన స్కందుని ఆలయమును నిర్మించుట కెంతేని ఆస్కారమున్నది. నేటి విశాఖపట్టణ ప్రాంతము నాటి విశాఖవర్మ రాజ్యపరిధిలోనికి వస్తుంది. సముద్రతీరమున ఈశ్వరాలయములు (ఉదా: రామేశ్వరం) నిర్మించు ఆచారమున్నది. విశాఖవర్మచే నిర్మింపబడినది కావున ఆ ఆలయమునకు విశాఖేశ్వరాలయమనియు, ఆ ఆలయమున్న తావునకు విశాఖపట్టణమనియు పేరు ఏర్పడి ఉండవచ్చును.

చరిత్రకారులు ఇంకను ఈ విషయమై చర్చించెదరు గాక!

**అధోజ్ఞాపికలు :**


1) ఈనాడు (విజయనగరం) 16 మార్చి 1989, పు-4.

2) ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (విజయనగరం), 22 సెప్టెంబర్, 1989.

3) పైది. 3 అక్టోబర్, 1989.

4) మామిడిపూడి వేంకటరంగయ్య (సం). సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము, ఎనిమిదవ సంపుటము (హైదరాబాద్, 1971), పు-260.

5) కవికొండల వేంకట సత్యనారాయణమూర్తి, విశాఖమండల చరిత్రము (కాకినాడ, 1927), పు-1, 2.

6) విజాపురపు వేంకట కోదండరామ పంతులు 'విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము (        ) పు-1.

7) బులుసు వేంకటరమణయ్య, 'ప్రాచీన శిథిలాలు - ధర్మపథం', ఆంధ్రపత్రిక (వీక్లీ), 28-9-1984, పు-27.

8) డా॥ ఎమ్. యస్. ఆర్. ఆంజనేయులు, .... .... ....

9) దక్షిణ హిందూదేశ శాసన సంపుటములు, 4. నెం-1012.

10) పైది. 10. నెం-651.

11) డా॥ అల్లాడి వైదేహి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర-మధ్య యుగము, (హైదరాబాద్, 1978) పు-47.

12) డా॥ పి. వి. పరబ్రహ్మశాస్త్రి (సం), ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, కడప డిస్ట్రిక్ట్, పార్ట్ - 1, (హైదరాబాద్, 1977) పు-14.

13) డా॥ ఎన్. వెంకటరమణయ్య, ది ఈస్టరన్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి (మద్రాస్, 1950), పు-289.

14) డా॥ ఎన్. వెంకటరమణయ్య (సం), ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, వరంగల్ డిస్ట్రిక్ట్ (హైదరాబాద్, 1874), నెం-13.

15) డా॥ పి. వి. పరబ్రహ్మశాస్త్రి, (సం), ఇన్‌స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ, కరీంనగర్ డిస్ట్రిక్ట్, (హైదరాబాద్, 1974), నెం. 25 మరియు 36.

16) భావరాజు వేంకట కృష్ణారావు, ది హిస్టరీ ఆఫ్ ది ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ (మద్రాసు, 1942) పు. 394, 395.

17) రాయప్రోలు సుబ్రహ్మణ్యం (సం), తెలుగు సంస్కృతి, మొదటి సంపుటము, (పునస్సంశోధితం) (హైదరాబాద్, 1983), పు-75.

18) ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ, పు. 394, 467, 631.




# అమ్మ జ్ఞాపకాల వధ్యశిలపై

## "ముత్యాల"

గుండె గోడల్ని చీల్చుకొని
కదలాడుతుంది అశాంతి స్వప్నంగా
నీ చిర్నవ్వు
విషాద నేత్ర జలపాతాల్లోంచి
అంతరంగంలో దారాలు అల్లుకున్న
చీకటి జ్ఞాపకాల శవంపై
చిరుగాలి అలల కదలికల
తెగిపడ్డ కలల స్వరాల సరంగా కూర్చి
అనురాగాల వలువలు వొదులుకొని
నిస్సిగ్గుగా బాధల వెకిలి నవ్వుల అగాధంలో
నల్లగా ముద్ద కట్టిన భవిష్యత్తు
అల్లుకున్న ఆశల మేఘాలు నేల కూలిన అంతరంగం
సమాధి నిశ్శబ్దాన్ని తడుముకుంటూ
అడుగులు జార్చుకున్న లేత మొగ్గకు
పారిపోయిన వసంతం
వెక్కిళ్ళు పట్టు కొస్తుంది
ఎండేసిన నిరాశలా ఆకాశం

జీవితాన్ని
ఊహల తోటల్లోకి నడిపించి
నీవు మాత్రం
మృత్యువు చిటికెన వేలు పట్టుకుని
మౌన ప్రవాహంలో జారిపడ్డావు
ఆకు రాలిన శబ్దంలోంచి
హేమంతం చుట్టుకొచ్చింది
కసాయి చేసిన గాయానికి
భళ్ళున కూలిపోయింది జీవిత వృక్షం

చిగురాకు పసిడి హృదయాల మీద జారవిడుస్తున్న
మంచి ముత్యాల మంచు బిందువుల స్పర్శకోసమూ కాదు
అంతరాంతరాల అస్తిత్వం రాల్చుకున్న
నక్షత్రాల దీన నేత్రాల విషాదం గురించీ కాదు
కదుల్తున్న అజ్ఞానంలో కదలని మానవత్వం చెక్కిళ్ళపై
వేలాడుతున్న కన్నీటి చారికల గురించీ కాదు

రాచిలకల రెక్కల చప్పుళ్ళలో
హృదయాగ్ని శిఖల జ్వాలల్లో
ప్రతి క్షణమూ ప్రతి చూపూ
నరాల్లో మౌనంగా పారే రక్తంలా
నిర్దాక్షిణ్యంగా మృత్యువు కొరికేసిన
కన్నతల్లి స్వర స్పర్శ స్తబ్ద గీతాల్లో
విధి దింపిన మేకుల బాధకి
గిరికీలు కొట్టిన గుండెల్తో
నన్ను నేను నిశ్శబ్దంలోకి విసిరేసి
కాలిన అనుభూతుల్లో ఆరేసుకుంటున్నాను
గుండె చీలిన ఆకాశంమీద
ఏమి ఎరగని పిచ్చి పసితనంలా
మాట్లాడుతున్నాను
మాతృ కలల పచ్చలారక ముందే
స్తబ్ద జగత్తులోకి
నెట్టేయబడిన నేను మాట్లాడుతున్నాను
భవిష్యత్తు క్షణాలను చిదిమేస్తున్న
స్మృతి రేఖలపై కదలాడుతూ
ముక్క చెక్కలుగా పగలకొట్టబడ్డ
నా హృదయాన్ని చూడండి

మమతల కళ్ళల్లో వికారంగా
మొలకెత్తుతున్న బ్రహ్మజెముళ్ళ వికృతత్వాన్ని చూడండి
కూలిన అంతరంగంలో
నా ఏకాకితనం అగాధాల లోతుల్ని
మీ మాతృ వాత్సల్య హృదయాల
శిఖరాల ఎత్తుల్ని కొల్చుకోండి
జీవితాల లోతుల్లో నర్తించే
వాస్తవాల నిజ స్వరూపాల్ని
గుండెల్ని పిండేసిన రహస్యాల్ని
స్తబ్ద నరాల నిశ్శబ్ద నిశీధి శిఖరాల
అశ్రు గీతాల స్వర్ణ సంగీతాల్ని
అపరిచితపు చిరపరిచిత యమయాతనల్ని
పట్టుకు వేలాడుతున్న నేపథ్యం

ఎక్కడ నుంచి పలుకుతుంది
బోసిబోయిన హృది లోపల
ఆ గొంతుక

బావురుమనే చీకటి గది లోపల-
గూడు లేని పక్షిలా తిరగడం తప్ప
ఈ మనసులో ఏముంది-
నొక్కి చెప్పితే నిశ్శబ్దం
శబ్దాధారం లేని భావన-
ఒక అస్పృష్టానుభూతి-
అవున్నిజం, నిజం

జీవితం సెకనుల ముల్లు
జీవితం అడుగుల సందడి
జీవితం విరక్తి
జీవితం అనక్తి
జీవితం మెరుపు
జీవితం చావు
జీవితం ఒక జ్ఞాపకం

జీవితాన్ని మింగేస్తుంది కాలం
కాలాన్ని చరిత్ర చేయడం బతుకు.

# వెలుగు పులుగు

## శ్రీ శివలింగం

ఈ నది జీవ నది
ఈ వృక్షం సతత హరిత
నీలో పారుతోంది నది
        నీకు తెలియదు.
నీలో కుసుమ వికసిత
ఫలభరిత వృక్షం
        నీకు తెలియదు.
        అది అనాది.
అదే నీ బతుక్కి పునాది.

పెంచి తయతో నీకో అస్తిత్వం
రూపం కల్పించిన దాది.
గల గల పారే నదిలో
మిల మిల మెరిసే నీళ్ళు.
నది పాటు బతుకు బాట
పక్ష్మాలు విప్పుతున్న సూర్యుడు
సాగర సంగమం కోసం నది పరుగు
పక్షాలు పరుస్తూ అనంతాకాశంలోకి
ఎగిరే వెలుగు పులుగు.

డా॥ పెన్నా శివరామకృష్ణ

# శేషేంద్ర కవిత - భావచిత్ర భంగిమలు

"ది వర్డ్ 'ఇమేజ్' ఈజ్ ఒన్ ఆఫ్ ది మోస్ట్ కామన్ అండ్ ఎట్ ది సేమ్ టైమ్ మోస్ట్ ట్రబుల్‌సమ్ టర్మ్స్ ఇన్ లిటరరీ క్రిటిసిజమ్."[1]

కవిత్వ విమర్శలో అతి ప్రచురంగా ప్రయోగింపబడే ఇమేజ్ అనే పదాన్ని నిర్దిష్టంగా నిర్వచించటం సులభ సాధ్యం కాదు. ఈ శబ్దానికి ప్రతిమ, మూర్తి, మూర్తి, ప్రతికృతి, ప్రతిబింబం, ఛాయ, ప్రతిచ్ఛాయ మొదలయిన అర్థాలున్నాయి.[2] థియోడర్ జోల్‌కోవస్కీ[3] ఈ పదానికి మూర్తి (ఐకాన్), మానసిక చిత్రం (మెంటల్ పిక్చర్), అలంకారం (ఫిగర్ ఆఫ్ స్పీచ్) అనే అర్థాలు చెప్పారు. సాధారణార్థంలో ఏదయినా ఒక సంఘటనకు గాని, వస్తువుకు గాని, వ్యక్తికి గాని, చేసే ప్రతి సృష్టిని ఇమేజ్ అనవచ్చు. పంచేంద్రియానుభవాల వలన ఏర్పడే మానసిక చిత్రాన్ని 'ఇమేజ్'గా పేర్కొన్నారు విమర్శకులు. పదాలతో చిత్రింపబడి పాఠకునిలో ఆవిష్కరించగలిగిన కవి అనుభూతిని మానసిక చిత్రం ఇమేజ్ అని సాహిత్యంలో విలక్షణార్థాన్ని పొందినది.

ఇమేజ్‌కు బహువచన రూపం 'ఇమేజరీ'. ఇమేజ్‌కు సమానార్థకాలుగా తెలుగులో పదచిత్రం, భావచిత్రం, శబ్దచిత్రం, 'కావ్యబింబం' అనే పదాలు ప్రయోగంలో ఉన్నాయి. నారాయణ రెడ్డిగారు[4] "ఇమేజరీ యనగా కల్పన యనవచ్చును. 'ఇమేజ్' యనగా కల్పనా చిత్రమనవచ్చు. కాని దీనికన్న పదచిత్రమనుట లోనే సామంజస్య మున్నది" అన్నారు. పదచిత్రం, శబ్దచిత్రం అనేవి సమానార్థకాలే కవికున్న మాధ్యమం పదాలే కనుక వాటిని పదచిత్రమని ప్రత్యేకంగా పేర్కొనాల్సిన అవసరం లేదు. శబ్ద చిత్రమనగానే యమకాది రూప కేవల శబ్దచిత్రమనే భావం స్ఫురిస్తున్నది. అట్టి చిత్ర కవితకు సాహిత్యంలో అధమ స్థానమే. కనుక పదచిత్రం, శబ్ద చిత్రమనే పదాలు సమర్థ వంతాలు కావు.

హిందీ సాహిత్య విమర్శకులు, ప్రాచీన భారతీయాలంకారికులు చెప్పిన బింబ ప్రతిబింబ భావాన్ని దృష్టిలో నుంచుకొని కావ్యబింబం అనే పదబంధాన్ని ప్రయోగించినట్లు తెలుస్తుంది. ఆధునికుల బింబం ప్రాచీనుల ప్రతిబింబ పదానికి సమానార్థకం. కనుక కావ్యబింబంలో స్పష్టమయిన అభివ్యక్తి కనిపించదు. భావ రూపమయిన చిత్రం అనే అర్థాన్నిచ్చే భావచిత్రం అనే పద బంధమే సమంజసంగా కనిపిస్తుంది.

కవి తన అనుభూతిని పాఠకునికి అందించటంలో గల వైవిధ్యాన్ని ప్రస్తుతీకరించినాయి వివిధ ఆలంకారిక ప్రస్థానాలు. కవి అనుభూతి పఠిత హృదయ ఫలకానికి హత్తుకోవటం చిత్రణ నైపుణ్యం వలన జరుగుతుంది. తద్వారా ఆ చిత్రం అందించే విశిష్టార్థ ద్యోతకత్వమే ధ్వన్యాత్మకత. ఆధునికులు ప్రయోగించే భావచిత్రం దృశ్యాత్మకత్వానికి ప్రాతినిధ్యం వహిస్తుంది, ప్రతీక ధ్వన్యాత్మకతకు దోహదపడుతుంది.

"ఏన్ ఇమేజ్ ఈజ్ నాట్ అన్‌లైక్ ఎ సింబల్.... బట్ వేర్ యాజ్ అదర్ సింబల్ ప్రెజెంటింగ్ ఇట్‌సెల్ఫ్ సజెషన్ సమ్‌థింగ్ ఇన్‌డెఫనట్, 'హిజ్ ఇమేజ్ సజెస్టింగ్ సమ్‌థింగ్ ఆల్‌మోస్ట్ యాజ్ డిఫినట్ ఎ ఇట్‌సెల్ఫ్...."[5]

ప్రతీకలోని అస్పష్టత భావచిత్రంలో ఉండదు. భావ చిత్రం సూక్ష్మమైన రూపరేఖలతో విషయాన్ని వ్యక్తపరుస్తుంది. ప్రతీక స్థూలమయింది. కాగా భావచిత్రం సూక్ష్మమయింది.

కవిత్వంలోని అనుభూతి గాఢత, చిత్రలేఖనంలోని అభివ్యక్తి విశిష్టత కలిపి ఏర్పడిన సమగ్ర కవితాకళ భావ చిత్రం. వర్ణ సంయోజన సాదృశ్యంలో ఉపమ కనిపించవచ్చు; చిత్రీకరణ సామర్థ్యంలో రూపకం రూపుకట్టవచ్చు. రేఖలు ప్రతీకాత్మకంగా ప్రతిస్పందింపవచ్చు; సమగ్ర చిత్ర స్వభావోక్తికి సమాదర్శం కావచ్చు అప్రస్తుత విషయాన్ని వ్యంజించవచ్చు. సర్వకవితా సామగ్రిని సమాదరించే సమగ్ర సజీవ కవితాకళ పత్రం భావచిత్రం.

రసం యొక్క వ్యక్తీకరణ, అలంకారం యొక్క శోభ, వ్యంజన స్వభావమయిన వక్రత సంగీతం యొక్క ధ్వనిసాధన, శిల్పం యొక్క సౌష్ఠవం చిత్రలేఖనంలోని రాగాత్మకత, శైలి

యొక్క వైయక్తికతలకు సమాహార రూపమే భావచిత్రం అన్నారు డా॥ ధర్మశీల.[6]

భావచిత్రాలను వస్తుగత భావచిత్రాలని (ఆబ్జెక్టివ్ ఇమేజెస్), విషయగత భావచిత్రాలని (సబ్జెక్టివ్ ఇమేజెస్) రెండు విధాలుగా విభజించినారు విమర్శకులు.[7]

వస్తుగత భావచిత్రాలను దృశ్య భావచిత్రం (విజువల్ ఇమేజ్), శ్రవ్య భావచిత్రం (ఆడిటరీ ఇమేజ్) ఘ్రాణ భావచిత్రం (అల్ఫేటరీ ఇమేజ్), ఆస్వాద్య భావచిత్రం (గస్టేటరీ ఇమేజ్), స్పర్శ భావచిత్రం (టాక్టువల్ ఇమేజ్), ఐంద్రిక భావచిత్రం, సమవాయభావచిత్రం (సిన్ ఈస్థటిక్ ఇమేజ్), అని ఏడు విధాలుగా చెప్పినారు విమర్శకులు వర్ణ, ఆకృత్యాదులయిన దృగ్గోచరాంశాలను చెప్పేది దృశ్య భావచిత్రం స్థిరదృశ్య భావచిత్ర, చలనదృశ్య భావచిత్రం అని దీనిని రెండు రకాలుగా పేర్కొనవచ్చు. కర్ణేంద్రియం వలన ప్రాప్తించే అనుభవాలకు అనుభూతులకు సంబంధించింది శ్రవ్యభావచిత్రం. ఘ్రాణేంద్రియానుభవాలకు ఆకృతి ఘ్రాణ భావచిత్రం. అనేక రకాల రుచుల ఆధారంగా కల్పింపబడేది ఆస్వాద్య భావచిత్రం. స్పర్శానుభూతులను తెలిపేది స్పర్శ భావచిత్రం. గుప్తాంగాల ఆధారంగా చిత్రింపబడేది లైంగిక భావచిత్రం. ఇంద్రియ విషయాలను వాటి సాదృశ్యాలను విచిత్రంగా సంయోగపరచటం సమవాయ భావచిత్రం.

విషయగత భావచిత్రాలు సామాజిక, రాజనైతిక, పౌరాణిక, చారిత్రక, సాంస్కృతిక, వైజ్ఞానిక, ప్రకృతిపర, కళాత్మక, దైనందిన జీవనసంబంధి, అరూప విషయగతమయినదిగా అనేక విధాలుగా ఉండవచ్చు.

మనస్సు బుద్ధి ఏకాగ్రమయినప్పుడే కళ్ళు చూపిన దృశ్యం భావచిత్రంగా రూపొందుతుంది. ఇంద్రియానుభవం హృదయంలో అనుభూతిగా మారి బుద్ధి ద్వారా నిశ్చయాత్మక మవుతుంది. మనోబుద్ధులు చేసే ఈ గ్రహణ పరిశీలనలే దృశ్యేతర ఇంద్రియానుభవాల విషయంలో కూడ చూడటంగా వాసన చూశాను, త్రాగి చూశాను ఇత్యాది చెప్పబడుతుంది. కనుక ఏ ఇంద్రియానుభూతికయినా దృశ్యతత్త్వం తప్పనిసరి. ఇంద్రియానుభూతులలోని దృశ్యతత్త్వమే కవి అభివ్యక్తి విశిష్టత ననుసరించి వివిధ భంగిమలలో భావచిత్రంగా సాక్షాత్కరిస్తుంది.

స్థావరాలలో ప్రాణశక్తిని, మానవేతర ప్రాణులలో మానవోద్రేకాలను పశుపక్ష్యాది లక్షణాలను ఇతర వస్తువులన్నింటికీ ఆరోపించటం శేషేంద్ర భావచిత్రాలలో కనిపిస్తున్నవి. ప్రతిపద సార్థకత, శ్రుతి సుభగ పదబంధ నిర్మాణం, వాక్యలయ ఆయన భావచిత్రాలకు విశిష్టతను చేకూర్చినాయి.

శేషేంద్ర కవితలో ప్రకృతి పరమయిన భావచిత్రాలు అధికంగా రూపుదిద్దుకున్నాయి. ప్రకృతిని ప్రతీకాత్మకంగా దర్శించి చిత్రించటం వలన ఆయన కవితలో ప్రతీకాత్మకత భావచిత్రాల ప్రాధాన్యం కనిపిస్తుంది.

"కవిత్వం ఎర్ర గుర్రంలా పరుగెత్తుకు వస్తోంది
రక్తంలో మునిగిన బాణంలా వీరుడు విడిచిన ప్రాణంలా"

పై భావచిత్రంలో మూడు ఉపమానాలున్నాయి. అవి నిజానికి ఉపమానాలు కావు. ఉపమానాలుగా రూపొందింపబడిన ప్రతీకలు. ఈ మూడు ప్రతీకలు కలిగించే అనుభూతి వ్యగ్రతకు ఆ ప్రతీకలు వ్యంజనాశక్తి ఎంత కారణమో భావచిత్ర రచనలోని అంగాంగి సమన్వయం అంత కారణం. కవితకు ప్రాణమయిన ఆవేశానికి ప్రతీక 'ఎర్ర గుర్రం'. దురాగతాలకు గురయిన వర్గపు ప్రతీకార జ్వాలకు ప్రతీక 'రక్తంలో మునిగిన బాణం'. వేలాదిమందిని యోధులుగా తీర్చిదిద్ది ప్రేరణగా నిలుస్తుంది, వీరుడు విడిచిన ప్రాణం. అనుభూతి గమ్యంగా సాగే సోపానాలలో మొదటి రెండు దృగ్గోచరమయ్యే ప్రతీకలు. చిట్టచివర అమూర్త ప్రతీక ప్రయోగింపబడటం వలన భావ చమత్కారం పరాకాష్ఠ నందుతుంది. "ప్రతీకవల్ల ఒక అంశానికి భావ తీక్ష్ణత, తీవ్రత ప్రాప్తించగా సమగ్రత భావపూర్ణత భావచిత్రంవల్ల కల్గుతాయి. అందుచేతనే ఉత్కృష్టమయిన కవితలో ప్రతీకలు భావచిత్రాలు రెండూ తోడుగా ప్రయోగింపబడుతూ ఉంటాయి."[8] సశక్తమయిన ప్రతీకలతో తీర్చబడిన ఈ ప్రతీకాత్మక భావచిత్రం కవిత్వం ఈనాడు సాధింపవలసిన ప్రయోజనాలను ప్రస్ఫుటీకరించింది.

"నేనొక చెమట బిందువుని కండల కొండల్లో
ఉదయించే లోక బంధువుని
గుండెలతో నాకు దోస్తీ నేనుండేది బాధల బస్తీ"

'చెమట బిందువు' శ్రమశక్తికి ప్రతీక. సూర్యుడు జీవన వికాసానికి, జనజాగృతికి, అభ్యున్నతికి ప్రతీక చెమట బిందువు అనే ఒక ప్రతీకను మరొక ప్రతీకతో ఉపమించటం ఈ భావ చిత్రంలోని విశిష్టత. సూర్యుడనే అర్థంలో ప్రయోగింపబడిన 'లోక బంధువ'నే ప్రయోగం చెమట బిందువు విశిష్టతను మరింత

స్పష్టంగా వ్యక్తమవుతున్నది. 'దోస్తీ' అనే మాట ద్వారా మిత్రుడనే శబ్దం, తద్వారా సూర్యుడు స్నేహితుడు అనే ద్విపదార్థాలు కూడా స్ఫురిస్తున్నాయి. చెమటబిందువు, కండలు, కొండలు, సూర్యుడు బహిర్నేత్రానికి గోచరమయ్యేవి కాగా గుండెలు, బాధలు భావాత్మకమయినవి

"వేళ్ళు కాళ్ళయి నడిచే చెట్టు మనిషి
చెట్టుగా ఉంటే ఏడాది కొక వసంతమన్నా దక్కేది
మనిషినై అన్ని వసంతాలు కోల్పోయాను"

ఈ వ్యవస్థలో నిర్జీవ స్థితిలోనున్న మానవుని నైరాశ్యాన్ని వ్యక్తపరుస్తుంది ఈ భావచిత్రం మొదటి వాక్యంలో మనిషి చెట్టుగా రూపింపబడినాడు. రెండవ వాక్యంలో ఉపమానోపమేయాలకు సహేతుకమయిన వైవిధ్యం సృష్టించటంలో ఈ భావచిత్రం నైరాశ్యాన్ని వ్యంజించటంలో శక్తివంతంగా తయారయినది

"నా దేశపు దినాలు రాళ్ళకు తగిలి పగులుతున్న పడవలు
నా దేశపు రాత్రులు గుండెకు తగిలి రగులుతున్న గొడవలు"

వీటిని రూపకానుప్రాణిత శ్రవ్య సంబంధి భావచిత్రాలుగా చెప్పవచ్చు. మొదటి వాక్యంలో ఉపమానం మూర్తమయినది; రెండవ వాక్యంలో అమూర్తమయినది. సుఖాల నీరు ఇంకిపోయిన సముద్రంలో మిగిలేవి సంకటాల శిలలు మాత్రమే. ఈనాటి వ్యవస్థలో బ్రతుకు పడవ భగ్నమయిపోగా అహర్నిశలు మానవుడెలా శాంతి దూరుడవుతున్నాడో తెలుపుతున్నవి భావచిత్రాలు.

భౌతిక ప్రపంచంలోని మూర్తిమంతమయిన పదార్థాలనే ఉపమానోపమేయాలుగా గ్రహించి చిత్రించిన సగుణ పదచిత్రాలు (కాంక్రీట్ ఇమేజెస్). అమూర్తమయి కేవలం అంతర్నేత్రానికి మాత్రమే అనుభూతమయ్యే నిర్గుణ పదచిత్రాలు (అబ్‌స్ట్రాక్ట్ ఇమేజెస్) శేషేంద్ర చిత్రించినాడు. నిర్గుణ పదచిత్రాలలో కవి అనుభూతి గాఢత, ఆవేశ తీవ్రత, దర్శన ప్రతిభ వ్యక్తమవుతాయి. కనుకనే నిర్గుణ పదచిత్రాలు పాఠకుల మానసికానుభూతులను జాగృత మొనర్చి తమిటా వస్తువుపట్ల సుముఖత నేర్పరుస్తాయి

"రస్తాలు వేస్తా కలల్లోకి
భవనాలు కడతా మబ్బుల్లోకి
ప్రాణాలతో నా దేశపు సరిహద్దుల కుడ్యాలు లేపుతా
శత్రువుల గుండెల్లోకి"

సుఖజీవనానికి ప్రతీక అయిన 'కలలు' అమూర్తాలు. మొదటి అంశంలో లక్ష్యం కలలు అయితే రెండవ అంశంలో లక్ష్యం 'శత్రువుల గుండెలు' రెండవ భాగంలో ఉపకరణాలయిన ప్రాణాలు లక్ష్యమయిన 'శత్రువుల గుండెలు' రెండూ అమూర్తాలు. మొదటి వాక్యంలో జీవం పోసుకున్న ఈ భావచిత్రం మూడో వాక్యంలో అస్థిమాంసాలతో పరిపుష్టమయింది. రస్తాలు, కలలు, భవనాలు, మబ్బులు, సరిహద్దుల కుడ్యాలు ప్రతీకలనే విషయం ఇక్కడ గమనార్హం. భవనాలు, సరిహద్దుల కుడ్యాల ఔన్నత్యం తెలపటమే సాధారణంగా కనిపిస్తుంది. కాని ఒకచోట మబ్బుల్లోకి అని మరోచోట శత్రువుల గుండెల్లోకి అనటం వలన మొదటిదానిలో కర్తవ్య నిర్వహణలోని ఉత్సాహం వ్యక్తమవుతున్నది రెండవదానిలో లక్షణావృత్తి ఆధారంగా శత్రునాశనం కొరకు సిద్ధపడటం ద్యోతకమవుతున్నది. శత్రువు గుండెల్లో నిద్రపోవటం అనే నానుడికి అందమయిన అభివ్యక్తి ఇది. పై భావచిత్రంలో మూడు వాక్యాలున్నాయనుకుంటే క్రమంగా పెరిగిన వాక్యాల దైర్ఘ్యత, అంత్యప్రాసలు, కుడ్యాలు, గుండెల్లోకి అనే శబ్దాలు ఉత్సాహ తీవ్రత కనుగుణంగా ఉన్నాయి. చివరి వాక్యంలో 'కుడ్యాలు', 'గుండెల్లోకి' అనే పదాలకు బదులు మరే పర్యాయ పదాల నుపయోగించినా వాక్యం తన తేజస్సును కోల్పోతుంది.

"కాలాన్ని నా కాగితం చేసుకుంటా
దానిమీద లోకానికి ఒక స్వప్నం రాసి ఇస్తా
దానికింద నా ఊపిరితో సంతకం చేస్తా"

శ్రామికుని లక్ష్యాన్ని, ప్రస్థానాన్ని, ప్రయోజనాన్ని అనుభూతి పూర్వకంగా తెలియజేస్తున్నదీ భావచిత్రం. రూపంలేని కాలాన్ని కాగితంగా చేసుకుని వ్రాయబడింది స్వప్నం. ఊపిరితో సంతకం చేస్తా అనే వాక్యం ఆ స్వప్నాన్ని నిజం చేయటం కోసం తన ప్రాణాలను పణంగా పెడతాననే భావాన్ని ధ్వనిస్తున్నది.

"నా కోరిక గొంతెత్తి అరుస్తుంది
కాలపు వెన్నెముక విరగ్గొడుతుంది
దిగంత రేఖల్ని చింపివేస్తుంది
ఒక కొత్తశకాన్ని లోకం మీదికి విసిరివేస్తుంది."

ఈ భావచిత్రంలో 'కోరిక' అనే భావానికి సర్వశక్తి సంపన్నత ఆరోపింపబడింది. దాని శక్తిచేత చలింపజేయబడే అంశాలకు కూడా దృశ్యత్వారోపణ చేయటం వలన సహజత్వం సిద్ధించింది.

మానవునిలో జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తికి ప్రేరకం. ఇచ్ఛాశక్తి క్రియాశక్తిని ప్రజ్వలితం చేస్తుందనే ధ్వనిపై భావచిత్రానికి అంతస్తత్వం.

"పశువుల గొంతుల్లో పాటను పుచ్చుకొని పారిపోయింది రాత్రి", "అశలు రక్త బిందువులు కలిపి అల్లిన దండ" మొదలయిన భావచిత్రాలలో, మూర్త, అమూర్త పదార్థాల సమ్మేళనంలో అమూర్త భావాలన్నీ స్పష్టమయిన రూపాన్ని పొందినాయి.

"చీకటి రాబందులు కనుగుడ్లు తింటున్నాయి." అనేది ఆస్వాద్య భావచిత్రంలా కనిపించే బీభత్సాత్మకమయిన గాఢాంధకార వర్ణనగాని, చెవుల్లో గంభీర నిశ్శబ్ద ఘంటలు మ్రోగుతున్నాయి - అనే శ్రవ్యభావచిత్రంలా కనిపిస్తూ, పరస్పర వ్యతిరేకార్థక శబ్దాలతో కూడిన నిశ్శబ్ద వర్ణనగాని సాధారణ అనుభవాలను సాధారణ శబ్దాల ద్వారా అసాధారణంగా చిత్రించినాడు.

"భూమిలో ఉన్న చిన్నారి గింజ మెడ బయటపెట్టి, మొదట వచ్చిన రెండాకుల్ని చేతులుగా జోడించింది కృతజ్ఞతతో" దీనిలో అతి సాధారణమయిన ప్రకృతి దృశ్యాన్ని ఉత్ప్రేక్షించి భావచిత్రంగా రూపొందించిన తీరు శేషేంద్ర భావనాశక్తికి నిదర్శనం.

"సూర్యుడస్తమించని నా మాటల దేశాలు" అన్నాడు. ఒక్కొక్క మాట ఒక దేశం; సూర్యుడస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యమంత విశాలమయినది. పదాల కూర్పు ద్వారా ఒక్కొక్క మాటకు అనంతమయిన భావవైశాల్యాన్ని కల్పించినాడు.

మందహాసాలు చిందే పర్వతాలు, క్రూరనగరాల జనపదవడలు, నగ్నవృక్షత, వలసపోయిన చెట్ల కుటుంబాలు, పళ్ళ నిట్టూర్పులు, ఆక్రోశిస్తున్న అడవులు, పొలాల పొదుగులు మొదలయిన పదచిత్రాలలో అచేతనాలకు జీవశక్తిని ఆరోపించటం జరిగింది.

గర్జించే శూన్యం, కిరణాల బండ్లు, కిరణాల సమూహాలు, ఆత్మ ఉపిరితిత్తులు, కలల ఖనాళా, ఆశల ద్వీపాలు, ఎగిరిపోయిన నిమిషాలు, మలిపెచ్చటి కోర్కెలు, నిశ్శబ్దపు పాలిగూడు, కోర్కెలు శిఖరాలమీద నిల్చొనున్న దేవాలయాలు, అనుభవాల రథచక్రాలు, భావాల మేఘాలు, ఎదిరించే శతాబ్దాలు, కలల రక్తనాళాలు, కాలపు రేవులు, కోర్కెల బందూకులు, కలలగాలం మొదలయిన పదచిత్రాలలో మూర్త అమూర్త పదార్థాలు ఉపమానోపమేయాలుగా ప్రయోగింపబడినాయి.

ఆధునిక మహాభారతంలో సూర్యుని ప్రసక్తి సుమారు 75 సార్లు వస్తుంది. సూర్యుడు కేంద్రంగా అనేక సందర్భాలలో ప్రతీకలు భావచిత్రాలు కూర్చినాడు. కాని అసాధారణమయిన భావుకతతో ఒకదానికి మరొకదానికి పోలిక లేకుండ వైవిధ్యంతో భావచిత్రాలతో శేషేంద్ర పాఠకులను సమ్మోహితులను చేస్తాడు. ఈ క్రింద పేర్కొనబడిన కొన్ని భావచిత్రాలు ఈ విషయాన్ని ఋజువు చేస్తాయి.

"లేస్తోంది ఉషఃకాంతుల్లోనుంచి ఒక హస్తం, ఆ హస్తం
కాలమనే నిరంతర శ్రామికుని సమస్తం మనిషి పొలాల్లో
ప్రవహించే చెమటలో రక్తంలో మునిగి లేస్తోంది,
దూర దూరాలకు సిందూర కాంతులు చిందుతూ ఉంది"
[ఆ. భా. పు. 1]

"దినం సూర్యుడ్ని పూర్తిగా కొల్లగొట్టి తరిమివేస్తే పాపం
కట్టుబట్టలతో నిష్క్రమించాడు పడమటి పొలాల మీదుగా"
[పు - 39]

"క్షణంలో, తూర్పు గుడిసెమీద గొంతెత్తిన ఎర్రటి
కోడిపుంజులా లేచాడు సూర్యుడు" [పు - 4]

"సూర్యుడు కిరణాల బండ్లు తోలుకుని వస్తున్నాడు" [పు-4]

"ఇక్కడ సూర్యుడే రోజూ రాత్రుల గర్భంలోనించి ముక్కుమొహమూ లేని రక్తపిండంలా ఊడిపడుతుంటాడు" [పు-21]

"నేను చెమట బిందువుని
కండల కొండల్లో ఉదయించే లోకబంధువును [పు-49]

"రోజూ ఉదయాద్రి శిఖరం మీద
రక్తకాంతులు చిందే సుంద్రవి పాట" [పు-53]

"సూర్యుడు ప్రాచీరేఖమీద ఉన్నాడు
అలమారు మీద ఆపిల్ పండులా" [పు-68]

"నాగలి భుజాన వేసుకుని వస్తున్నాడు
సూర్యుడు కొండ శిఖరాలెక్కి" [పు-70]

"కండల కంతానికి లొంగి ఇక్కడ ఆకాశం
సూర్యుడ్ని అమ్ముకుంది గుప్పెడు నక్షత్రాల కోసం" [పు-86]

"అడవుల్లో ఉరితీసిన వీరుడిలా
ఉదయపు చెట్లలో వ్రేలాడుతున్నాడు సూర్యుడు" [పు-89]

"ఆకాశం సూర్యుడి దేవాలయం" [పు-119]

"సూర్యబింబం ముక్కలై నదిలో కొట్టుకుపోతుంది" [పు-140]

"మన మనోద్వార తోరణానికి, మానవతా సూర్యుడు
'జ్వలత్ జ్వాలా గుచ్ఛమై వ్రేలాడుతున్నాడు" [పు-229]

"సూర్యుడు పోయిన తర్వాత సూర్యుడి దయ్యంలా వస్తుంది
చీకటి [పు-244]

"సూర్యుడు సముద్రాలమీద వంగి నీళ్ళు తాగే గుర్రం"
[పు - 253]

"సూర్యుడు ఉదయం పూచిన పూలతో క్రీడిస్తున్నాడు."
[పు - 254]

ఇలాంటి భావచిత్రాలు విడిగా రమణీయ ప్రకృతి వర్ణనలుగా కనిపిస్తాయి. ఆయా సందర్భాలలో ఉంచి గమనించితే ప్రతీకాత్మక భావచిత్రాలుగా విశిష్టార్థ బోధకాలవుతాయి. గాఢమయిన కవి అనుభూతి కవితగా అవతరిస్తే ఆ కవిత కవి సంస్కారాన్ని సంతరించుకొని అంతఃసమన్వయాన్ని అలవరుచుకొని పాఠకుని ఆకర్షించి సమగ్ర ప్రయోజన సాధకమవుతుంది కవితా వస్తువుమీద కవికున్న అధికారాన్ని క్లుప్తంగా గుప్తంగా తీవ్రంగా చెబుతున్నాయి శేషేంద్ర భావచిత్రాలు.

సూచికలు :

1. థియోడర్ జోల్‌కోవస్కీ: డిజెన్‌ఛాన్టెడ్ ఇమేజెస్. పు-6.
2. సాన్‌స్క్రిట్ డిక్షనరీ: వి. యస్. ఆప్టే. పు-214.
3. డిజెన్‌ఛాన్టెడ్ ఇమేజెస్. పు-10.
4. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు. పు - 561.
5. టి. యి. హ్యూమ్. [విలియం యై టిండాల్ : ది లిటరరీ సింబల్ పు-348 నుండి గ్రహించాను.]
6. కావ్యబింబ్ : కామాయనీ కా యోజనా. పు-66.
7. ఎ. వెంకటరావు, తెలుగు అభ్యుదయ కవిత్వంలో భావచిత్రాలు. [ఉస్మానియా విశ్వవిద్యాలయానికి యం. ఫిల్. పట్టానికై సమర్పింపబడిన సిద్ధాంత వ్యాసం. వ్రాతప్రతి] లో చేసిన విభజనే ఇక్కడ గ్రహించాను.
8. పైదే. పు - 62.

~~~~~~~~~~~~

# అక్షరం అక్షయమై...

అక్షరం
మొలకెత్తుతుంది విత్తనంలా
పదాల కొమ్మల్లో చివుళ్ళెత్తి
విరబూస్తుంది పుష్పంలా

అక్షరం
ధ్వనిస్తుంది మృదంగనాదంలా
ప్రజల గొంతుకల్లోంచి
దూసుకొచ్చే నినాదంలా

అక్షరం
పొడుచుకొస్తుంది తొలిపొద్దులా
పుడమి గుండెల్ని
స్పృశించే తొలిముద్దులా

అక్షరం కవితవుతుంది
మొగ్గ పుష్పమైనట్లు
అక్షరం కావ్యమవుతుంది
పుష్పం ఫలమైనట్లు

అక్షరం - అక్షరం కలసి
పెనుమార్పుగ పల్లవించినట్లు
అక్షరం అక్షరం కలసి
పెను తుఫానుగ విప్లవించినట్లు

అక్షరం - హిమనగమై వెలుస్తుంది
అక్షరం - అక్షయమై నిలుస్తుంది.

—శ్రీ మద్దూరు శ్రీనివాసులు
~~~~~~~~~~~~

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెం

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ అయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది అమృతాంజన్-డెర్మల్ అయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు అదర్శమైన నివారిణి. నేడే కొనండి!

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

# "తెలుగు దున్నపోతు"

## డా॥ నాగినేని భాస్కరరావు

వర్షాభావంతో
అసంపూర్ణ జల పంపిణీలో
అయోమయ విద్యుత్ సరాఫరాతో
-అందిన చాలీచాలని పంటతో
ప్రభుత్వ రుణ ప్రణాళలతో
వణుకుతూ నీరసించిన జీర్ణవస్త్రధారి - కృషీవలుడు.

రక్షిత మంచినీటి కొరతలో
అసాంతం కమ్మిన దోపిడీ చీకటిలో
చాలని వసతి,
చాలని ఆహారంతో
కలుషిత వాతావరణంలో-వ్యవసాయ కూలి.

మురికి వాడలో, ఇరుకు గదిలో
మ్రగ్గే శరీరంతో
బొటాబొటీ భత్యంతో
పూట పూటకు అతి తక్కువ ధరకు
శ్రమను అమ్ముకుని పరిశ్రమల నిల్పే - శ్రామికుడు.

అన్నిట్లో ముందుంటామంటూ
వాస్తవంలో-
అన్నిట్లోనూ వంచించబడి
హింసించబడి, దారుణ దయనీయ స్థితిలో
"మార్కెట్ వస్తువు"గా-
మార్చబడ్డ - మానవి

ముగ్ధదశలోనే చెట్టుతత్వాన్ని కొనితెచ్చుకొని
మగతనాన్ని వదలి - మగతను జీర్ణించుకొని
ఎటూకాని అవ్యవస్థతో - యువత.

మంత్రి మారినప్పుడల్లా మారే
విద్యావిధానంలో-
మేధస్సు అమేధం శాసించే
తరుణంలో - విద్యార్థి.

రిలిజియిజం రాపిడికి
నాయకత్వ దోపిడికి
తట్టుకుని
ఏపరకు ఒంటరిగా
ఒంటెత్తుపోకడగా
ఒటు కాదు తూటా నా మార్గమని
గొంతెత్తిన - వర్గపోరాటకారుడు.

వీరితో మరికొందరు
మార్పు కోరుకున్న కాలంలో
అనుకూల కాలం గాలాన్ని చేపట్టి
ప్రజాజీవన సంద్రంలో
వాగ్దానాల నావను మరమ్మత్తు చేసుకుని
పదవుల చేపల కేతెంచి
తన హావభావముల చేత
పదవుల చేజిక్కించుకుని - నాయకుడు.

మార్గం మార్చి
పరిపాలన రోడ్డుమీద
ప్రజాసౌకర్యముల శకటమును పూన్చి
తోల నారంభించెను

శకటము కదలదు-
శకట సారధులు-సెక్రటరీలు
శ్రమించిరి, స్వేదమును స్రవించిరి
అప్పుడు తెలుసుకొనిరి.

నాయకుని 11వ అవతారమే
శకటమును లాగుచున్నదని-
పాపం దానికి-
పత్రికా సంచికలను నమలుటమే కాని
చదువుట తెలియనేర్వనిదని

అదియొక-
తెలుగు దున్నపోతని.

ఆచార్య జాస్తి సూర్యనారాయణ

# నేటి ద్రావిడార్య భాషల్లో సంస్కృతము

భావార్థకంలో త్వ-తల్ (తస్యభావ స్త్వతలౌ ఎ ఎ 5-1-119) అనే ప్రత్యయాలు వస్తాయని పాణిని వ్యాకరణం స్పష్టం గావించింది. గోత్వం (త్వ) గోతా (తల్) ఉదాహరణాలు దీన్నాధారంగా చేసుకునే తెలుగు (తద్ధిత-1)లో త్వ ప్రత్యయార్థంలో తన వస్తుందని నిర్దేశించటం జరిగింది. అంటే 'తల్' లేదా 'తా' అనేది యర్థంలో సంస్కృతంలో ఉన్నప్పటికీ మనవారు 'త'నే గ్రహించారు. సంస్కృతం నుంచి పదాలను ప్రత్యయాలను ఎక్కువగా గ్రహించిన హిందీలో 'త్వ' కన్న 'తా' అంతాలధికంగా ఉన్నాయి. పదాంతంలో సంయుక్తమైన (త్వ) ధ్వనిని వీలింతగా వాడుక చేయరు. దీనివల్ల వారు అసంయుక్తమైన 'తా'ని మాత్రమే ఆదరించి ఉంటారని చెప్పగలం.

'తా'కు సంస్కృతంలో సమూహార్థం గూడ (గ్రామజనబంధుభ్యస్తల్ 4-2-43) ఉంది. ఈ యర్థంలో దీని ప్రవృత్తి మూడు (గ్రామ-జన-బంధు) నామాలకు పరంగా చేరుతుంది. గజ సహాయ అనే మరో రెండు పదాలకు తరువాత ఈ ప్రత్యయం చేరటాన్ని వార్తికకారుడు ప్రతిపాదించాడు. ఈ యర్థంలో ఈ ప్రత్యయాన్ని హిందీవారు ప్రయోగించినట్లు నా పరిశీలనలో ఉదాహరణం లభించలేదు. ఒక రాజకీయ పార్టీకి పేరుగా అన్ని భాషలలోపాటు హిందీలో కూడా ప్రచారంలో ఉన్న జనతా (జన సమూహం) అనేది సంస్కృతం నుంచి దేశీయ భాషల్లోకి వచ్చినట్లు గ్రహించవగును.

'త్వ' అనే ప్రత్యయానికి బదులుగా తెలుగులో వచ్చే 'తన' అనేదానికి ప్రయోగం సూరదాస్‌లో కొన్నిచోట్ల గలదు. బ్రాహ్మణతన మృగతన అనేవా ప్రయోగములు. అంటే తన ప్రాకృతం నుంచి హిందీలోకి తెలుగులోకి వచ్చిందని చెప్పటమా? హిందీకన్న మునుపే ఈ ప్రత్యయం తెలుగులో గలదనేది నా సపము.

తెలుగు స్వార్థంలో వచ్చే 'ఇ'కారంతో సమానంగా 'ఇ'కారం హిందీకి మునుపు ప్రాకృతాలయినంత కాలంలో గలదని నేను సోదాహరణంగా (ప్రె హిందీ - తెలుగు - భారతి ఏప్రిల్ 1989లో) వివరించాను.

ఈ యంశాల్లో హిందీకి తెలుగుతో పొత్తు కుదురుతుంది. అంతేగాక విభిన్న తద్ధిత ప్రత్యయాలను నామాలకు పరంగా చేర్చి క్రొత్త క్రొత్త పదాలను నిర్మించటం గూడా హిందీలో గలదు. ఈ యంశంలో ప్రధానమైన భారతీయ భాషలు (ఆర్య ద్రావిడ) ఒకే విధంగా ఉన్నాయని మన ఉదాహరణ వల్ల గ్రహించగలం.

ఇతచ్ :

| | |
|---|---|
| హింది | ఏకత్రిత - మర్యాదిత, పేమిత, కుత్సిత |
| వంగ | గచ్ఛిత జడిత |
| మరాఠీ | ఏకత్రిత మర్యాదిత కేంద్రిత |
| గుజరాతీ | దోషిత |
| కన్నడ | చటులిత బధిరిత క్వథిత |
| తెలుగు | తిలతండులిత గవాక్షిత వలయిత తవాదావిత |

తర - తమ

| | |
|---|---|
| హింది | గూఢతర గురుతమ (గరిష్ఠ) ప్రియతమ అధికతర పుణ్యతమ దారుణ తర వరిష్ఠతమ |
| మరాఠీ | శ్రేష్ఠతమ శ్రేష్ఠక కనిష్ఠకని బృహత్తర ధునికతమ |
| వంగ | గురుతర జేష్ఠపుత్ర క్షీణతర ద్విగుణతర మూఢతమ |
| గుజరాతీ | ఉచ్చతర బృహత్తర |
| కన్నడ | పరిణతతర ఉజ్జ్వలతర పిశంగతర భయంకరతర |
| తెలుగు | దీర్ఘతర (ద్రాఘీయస్) అల్పతర గురుతర (గరిష్ఠ) |

ఇమనిచ్ :

హింది : అంతిమ ఆదిమ అగ్రిమ

మరాఠీ : అంతిమ లావిమ

గుజరాతీ : అంతిమ జడిమ

వంగ :

కన్నడ : ప్రౌఢిమ

తెలుగు : అగ్రిమ ప్రౌఢిమ గంభీరిమ చారిమ (చారు)
తరుణిమ పటిమ చతురిమ ఠకారిమ ద్రాఘిమ

ఇల

హిందీ : ధూమిల వ్వప్నిల ఫేనిల

వంగ . జన్మిల ఫేనిల

లచ్ :

తెలుగు : ధూమల శర్కరిల

మతుప్

హిందీ : భగవంత (భగవంత భజనా) హనుమంత క్రోధి
వంత హర్షవంత తృషావంత

మరాఠీ : విచారవంత శ్రీమంత మూర్తిమంత

కన్నడ : ఆచారవంత బుద్ధివంత

తెలుగు : ప్రేమవంత విధివంత హనుమన్త నిరాహారవంత
మౌనవంత మోక్షవంత ప్రాణవంత దోర్వంత

మత్ :

హిందీ : విధివత్ హర్షవత్ మూర్తిమత (మూర్తిమత)

వంగ . గర్వవతీ (గర్వవత్) బుద్ధిమతీ (బుద్ధిమత)

మరాఠీ శ్రీమతీ (శ్రీమత్)

గుజరాతీ మూర్తిమతీ అనురాగవతీ భక్తిమతీ

కన్నడ : మదవతీ

తెలుగు : భానుమత్ కాంతిమత్ యౌవనవతీ
కళ్యాణవతీ గభస్తిమత్ ధమత్ దోర్వత్ పక్షవత్

హిందీ : హనుమాన భగవాన

వంగ బుద్ధిమాన ఐశ్వర్యవాన

మరాఠీ . బుద్ధిమాన్ ప్రజ్ఞావాన్ బలవాన్ గతిమాన్

గుజరాతీ ఆయుష్మాన్ - భగవాన

పై భాషాకవుల (లాక్షణిక్య అబల్య) ప్రయోగ విశేషాలివి వీటిని ఆకృతిగణంలో చేర్చి గానీ తదన్యంగా గానీ సమర్థింప వచ్చును. కాని అలా సమర్థింప వీలుగాని ప్రయోగాలు కొన్ని ఆయా భాషల్లో ఉన్నాయి. వీటిని సంకర సంస్కృతం అని అంటారు. దీన్ని బుద్ధుని సిద్ధాంతాలను ప్రతిపాదించేవారు వాడుక చేశారు. ఇది గ్రంథస్థ భాష మాత్రమేగాని ఏనాడు ఏ దేశీయులను వాడుక చేసిన భాష గాదు.

ఈ గ్రంథ పరనంపల్ల ఈ పదాలసంఖ్యాకంగా వ్యవహారం లోకి వచ్చాయి. సంకర సంస్కృత లక్షణాలు కొన్ని నేటి భారతీయ భాషల్లో గనబడుతున్నాయి.

సంస్కృత పదాలను ప్రత్యయాలను (వాటి కలయికలోని ప్రత్యేకతను) ప్రత్యయాంశాలను వాడుక చేయటంలో ఉత్తర దేశీయుల భాష ముఖ్యంగా హిందీ, ద్రావిడ భాషలతో కొంత భేదిస్తుంది. ఈ భేదానికి బౌద్ధుల గ్రంథస్తమయిన భా..రణం

భాషా విషయికంగా బౌద్ధుల దృష్టిని తెలియజేయటం ఈ సందర్భంలో ముఖ్యం. బుద్ధుడు కపిలవస్తు నివాసి. నేటి బీహార్ ప్రాంతంలోని ప్రాంతాల్లో ఆయన చాలాకాలం విహరించాడు. ఆయన కిక్కడే జ్ఞానోదయ మయ్యిందంటారు. ఆయన తను గ్రహించిన సత్యాన్ని శిష్యులకు మొదటిసారి బోధించటం వారణాసిలో జరిగిందంటారు.

ఈయన తన భావాలను తెలపటానికి ఆనాడు ప్రచారంలో ఉన్న పాళీ భాషను స్వీకరించాడు. ప్రాంతీయ భేదాలిందున్నాయి. ఏ ప్రాంతం వారా ప్రాంతీయ భాషనే ఆదరించాలని బుద్ధుడు తన శిష్యులకు తెలియజేశాడు దీనివల్ల బౌద్ధ సిద్ధాంతాల బోధకుల భాషలో భేదం స్పష్టం.

సంస్కృతాది పురాణాలందు తగిన పాండిత్యం గల (కొందరు బ్రాహ్మణులు) బౌద్ధమతము నాదరించిరి. వీరికి ఈ మతానుయాయు లాశ్రయిస్తున్న భాషా వైవిధ్యం వింతగా అని పించింది ఇంతకుమునుపాశ్రయించిన హిందూమత సంప్రదాయమునకు దేశమంతట ఒకే విధమైన భాషను వాడుక చేయటం వారు గుర్తించారు. అంతేకాక భాషా విషయకంగా ఏకరూపత మిక్కిలి ప్రయోజనకారి అని వారు తమ అనుభవం వల్ల గ్రహించారు ఆ భాష సంస్కృతము పాణిని అనే వ్యాకరణకర్త ప్రతిపాదించిన భాష యది దీన్నే బౌద్ధులందరూ ఆశ్రయించుట మంచిదని వీ.. తలచారు దీనివల్ల కాలాంతరములో ప్రాంతీయ లగు భేదములు భాషకు సంక్రమించక ఏకరూపత నిలచియుండు ..ని వీరు తలంచిరి తాము గ్రహించిన ఈ సత్యమును బుద్ధునకు విన్నవించారు తన మతమునకు తత్సిద్ధాంతములకు సంస్కృత మును మాధ్యమముగ స్వీకరించుట నాయన అంగీకరించలేదు. ఏ

ప్రాంతమువారా ప్రాంతీయ విధేయమైన భాషలో తన సిద్ధాంతము లను గ్రహించటం తగునని యాతనవిధి.

ఇంతటితో సర్వసమగ్రము బహుజనాదరణ పాత్రము దేశ కాల భేదముల కతీతము అయిన సంస్కృత భాషా ప్రభావము బౌద్ధుల భాషపై ప్రసరించుట విరోధంగా లేదు. అనాటి వారు సంస్కృత విధేయముగ ప్రాకృతమును మలచి తమ గ్రంథము లందు ప్రయోగింప మొదలిడిరి.

ప్రాకృత (పాళీ) పదముపై సంస్కృత ప్రత్యయములను చేర్చగా నిష్పన్నమైన పదమును వాడుక చేయుట ఈ యుద్యమము నందలి సారాంశము. సంస్కృత భాషా నియమముల నన్నింటిని సమగ్రముగా పాటించు నుద్దేశము వీరికి లేదు. తమ భాషను సంస్కృతమునకు సన్నిహితముగ నుండునట్లు చేయుట వీరి ప్రయత్నము. ఈ యుద్యమము శతాబ్దములపాటి విచ్ఛిన్నముగ సాగినది. నాటి వారి భాష పాళీ కన్న వేరైనది. సంస్కృతముతో తుల్యముగ గుర్తింపరానిది.

'కృ' అనే సంస్కృత ధాతువు నుంచి కర్ అనే క్రియ ప్రాకృతంలో ఏర్పడింది. పాళీలో గూడ ఇది ప్రసిద్ధి గాంచింది. దీనిపై సంస్కృతంలో గల 'శతృ (అత్) ప్రత్యయాన్ని చేర్చి నందు కరత చోరత్ మొదలయిన రూపాలు అనాటి వారి భాషలో ఏర్పడినాయి. కృ చోర్ అనే సంస్కృత ధాతువులకు శతృ ప్రత్యయం చేరి తా వికరణ ప్రతం (కాంజునేషన్ పైస్) రావాలి కృ = కుర్+ఉ+అత్ = కుర్వత్ చుర+అయ+అత్ = చోర యత్ ఇత్యాదిగ రూపాలు గావాలి. అలా కాకుండా పాళీ సంస్కృత లక్షణాలు గల కరత్ చోరత్ మొదలగువాటిని సంకర భాషలనాలి. ఇది సంస్కృతంవైపు మొగ్గు చూపుతున్నందున సంకర సంస్కృతం అనదగును.

ఈ భాష ఏనాడు ఎవరు తమ అభిప్రాయ ప్రకటనకు వాడుక చేసిన భాష కాదు కేవలం గ్రంథస్తమయినదీ భాష. ఈ విధంగా ఏర్పడిన పదాలు తద్దేశీయుల భాషల్లో ఉన్నాయి అంతే గాక అత్ మొదలైన ఈ సంస్కృత ప్రత్యయాలను దేశీయ పదాలకు పరంగా చేర్చినందున ఏర్పడే కహాంట ఉరత బైటత బాజ తగిరవ్ ఇంవ్ మొదలైనవీ భాషలో రూపుదాల్చి అనంతర కాలంలో హిందీ మొదలగు భాషల్లోకి వ్యాపించినవి.

---

# బాల్యాన్ని తుంచేస్తున్న చేతలు

ఎండ
నీళ్ళను సైతం మరిగించే ఎండ
'గుయ్యి'మనే వడగాలి
నడుస్తే కాళ్ళు మల మల మాడిపోతాయి.
"ఒరే కన్నా!
బయట ఆటలాడకు
వడదెబ్బ తగులుతుంది
పగలు పడుకో!"

బంగాళాఖాతంలో తుఫాను
ఆకాశంనిండా మబ్బులు
ఏనుగు తొండం దొడ్డువర్షం
ఇంటికప్పు ఎగిరిపోయేంత ఈదురుగాలి
"ఒరే చిన్నా!
అవతల వాన నీళ్ళల్లో తడవకు
జలుబు చేస్తుంది జ్వరం వస్తుంది
ఇంట్లోనే వుండు!"

సాయంత్రం అయిదు గంటలయితేనే చలి
చల్లని మంచు చలగా
కప్పుకోకుంటే
ముఖం కాళ్ళు మంచుగడ్డలే
"ఒరే పిల్లలూ
స్వెట్టర్లు వేసుకొని వేజులైన్ రాసుకోండి
పెదవులు ముఖం పగులుతాయి
రాత్రి తొందరగా బ్లాంకెట్లు కప్పుకోండి!"
ఉదయప్పూట
వసారాలో పేపరు తిప్పుతూ
మిత్రునితో చెప్పుకుపోతున్నాడాయన.

"చల్లని మా వూరు.
ఎండాకాలం చెరువులో హాయిగా ఈదేవాళ్ళం
వానాకాలం వీధుల్లో ఏంచక్కా కాగితం పడవలు
వేసేవాళ్ళం
చలికాలం రాత్రి నాలుగు బజార్ల వద్ద
వెచ్చగా జొన్న కొయ్యల మంటచుట్టూ
చలిమంటలు కాగేవాళ్ళం" అని___

—శ్రీ జూకంటి జగన్నాథం

# దళితాగ్రహం

## శ్రీ వాణీ రంగారావు

ఎవర్ని దేబిరిస్తున్నాం మేం
మేము వదిలిన గాలి
మీరు పీలుస్తున్నారో
మీరు వదిలిన గాలి
మేం పీలుస్తున్నామో
మొత్తానికి
మనమందరమూ పీల్చేది గాలే.

హరిజనుడని అనకముందూ
మేము మనుషులమే
హరిజనుడని అన్నాకా
మేము మనుషులమే.

అసలు అంటరానితనం
ఎక్కడుందో మాకు తెలీదనుకుంటే
మీ భ్రమ.

మా లేమిలో ఉంది అంటరానితనం
మా విడితనంలో ఉంది అంటరానితనం.
ఎవరి గర్భకుహరంలో ఏ బీజం పడిందో
ఎవరి పాలిండ్ల సౌందర్యాలు
పదిలంగా కాపాడుకునే యత్నంలో
ఎవరి పాలతో ఎవరి శరీరాల పెరిగాయో
ఎవరి కెరుక

అంటరానితనం లేనేలేదక్కడ
ఉందల్లా అధికారంలో
ఉందల్లా బానిసత్వంలో
భూస్వామ్యవర్గ దోపిడిలో

ఆర్. టి. సి. బస్సుమీద స్లోగన్సు
మైకుల ముందు లెక్చర్లూ
రిజర్వేషన్లు రాయితీలు
గుండెల్లో గూడు కట్టుకున్న
ద్వేషాగ్నిని చల్లార్చవు.
దృష్టిలో స్థిరపడిన
న్యూనతను పోగొట్టవు.
నిత్యం భజించే డబ్బు దేవుణ్ణి
కట్టేసుకోవాలనే స్వార్థ శిఖామణుల్ని
దూడల చచ్చిన గేదెల ముందు
గడ్డి దూడలలాంటి రాయితీల భ్రష్టుల్ని
నిర్వీర్యకుల్ని చేసేందుకే
ఆయుత్తం
ఈ ప్రయత్నం.

దళితులకి దయ చేయించే
శ్రాద్ధపు కర్మల్ని కాదు కోరేది
జీవించే హక్కు
ఊపిరి పీల్చే హక్కు.
'దగా తో ప్రసాదిస్తారా'
ఖబడ్దార్!

హస్తాల్ని కత్తుల్ని చేసి
చూపుల్ని తుపాకుల్ని చేసి
మేధల్ని అణుబాంబుల్ని చేసి
విస్ఫోటిస్తాం
విజేతలమవుతాం.

# తాగుబోతు

మూలం:
**కీ.శే. జయశంకర ప్రసాద్**

తెలుగు అనువాదం:
**శ్రీ కాలిపు వీరభద్రుడు**

"ఏడు రోజులయిందండయ్యగారూ, తాగకుండా ఉంటున్నానండి, గళాసుని కూడా తాకలేదంటే నమ్మండి!"

"పోరా అబద్ధాల పుట్టా, నీ బట్టల్నుంచి వస్తూన్న ఆ వాసనేంట్రా?"

"అదాండి, అది కూడా రోజులయిందండి ఏడు రోజులకంటే ఎక్కువేనండి. చీకట్లోనండి సారాకాయని మీదికెత్తి నోట్లోకి గటగటా వంపేస్తున్నానండి. అప్పుడే బట్టలమీద కొద్దిగా వడిందండి. మీ ముందు అబద్ధమెందుకండి నా మాట నమ్మండి. ఏడు రోజుల్నుంచి ఒక్క చుక్క కూడా ఎరగనండి!"

జమీందారు నవ్వారు. ఆయన కొడుకు లక్నోలో చదువుతున్నాడు. అప్పుడప్పుడు కొడుకు దగ్గరికి జమీందారొస్తూ ఉంటారు. కథలంటే చెవి కోసుకుంటారు. కథలు చెప్పేవాణ్ని వెతగ్గా వెతగ్గా యీ తాగుబోతు దొరికాడు. వీడు రాత్రి మధ్యాహ్నం, అప్పుడప్పుడు ఉదయం కూడా వస్తాడు. వీడుల విందైన కథల్ని మంచి పసందుగా చెప్పి జమీందారుగారికి వినోదాన్ని అందిస్తూ ఉంటాడు.

నవ్వుతూ జమీందారన్నారు-"అయితే యివాళ తాగుతావా!"

"అబద్ధమాడనండి. ఎంత దొరికినా యివాళ అమాంతం తాగేస్తానండి. ఏడు రోజుల్నుంచి శనగలు తింటూ కాలం గడుపుతున్నానండి"

"వింతగా వుందే. ఏడు రోజుల్నుంచి రుచిగా యింత తిండేయనివాడివి యిప్పుడు తాగాలనుకుంటున్నావా?...."

"హాయైన జీవితం ఒక్క గడియ చాలదాండి అయ్యగారూ కలకాలం దుఃఖాల జీవిత మెందుకండీ? ఆ హాయిలో యిలాంటి నీరసం రోజుల్ని యిట్టే గడిపేయొచ్చునండి"

"సరే, యివాళ నువ్వేమిటేమిటి చేసావో చెప్పు."

"నేనాండీ? ఉదయాన్నే పొగమంచు పడుతుందా? దాంట్లో సూర్యుడు ముఖాన్ని దాచుకున్నట్టుగానే మాసిన దుప్పటి ముసుగులో నేనూ నా ముఖాన్ని దాచుకున్నానండి."

"జమీందారు నవ్వుతూ అడిగారు - "ముఖం ముడుచుకొని పడుకోడానికి కారణం?"

"ఏడు రోజులైై ఒక్క చుక్క తాగలేదంటే యీ ముఖాన్ని ఎలా చూపిస్తానండీ లోకానికి? పన్నెండుకల్లా ఎండ బాగా వచ్చాక లేవక తప్పలేదండి. లేచి ముఖం కడుగుతూ వుంటే వుంటూండి వచ్చిన ఆ దుఃఖాన్ని నే చెప్పలేనండి డబ్బులయితే కొంచెం దగ్గరున్నాయండి. శనగలు తింటూ తింటూ అపహ్యం వేసిందండి. పరోటాల కోసమని వెళ్ళానండి. తింటూ పొయ్యి దగ్గర వెచ్చగా కూర్చున్నానండి. ఆ తర్వాత గోమతి ఒడ్డుకి వెళ్ళానండి. అక్కడ యిటూ అటూ తిరిగేటప్పటికి సాయంకాలమయిందండి మంచు పడుతూ ఉంటే పరుగెత్తుకొని తమ దగ్గరికొచ్చేసానండి."

"బావుంది. అవాళ గొల్లపిల్ల కథ చెప్పావా. అందులో అనవుద్దొలా ఆ అమ్మాయి చీర చెంగులో వేయించిన మొక్కజొన్న గింజలికి బదులుగా ముత్యాలు పోసాడన్నావు, అది నిజమేనా?"

"నిజమే అయ్యగారూ. పాపమా అమ్మాయి ఆకలితో ఉందేమో, నోట్లో పోసుకొని థూ థూ అని ఉమ్మేసిందండి!.... ఆ తర్వాత ఏడ్చేసిందండి. గొప్పోళ్ళెప్పుడూ మంచీ చెడ్డా ఆలోచించకుండా యిలాంటి వేళాకోళాలే చేస్తుంటారండి. ఆనాడు శ్రీరామచంద్రుడు కూడా హనుమంతుడి కిలాగే ముత్యాల హారం........"

జమీందారు పగలబడి నవ్వసాగారు. పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుతున్నారు. ఊపిరి తీసుకోడం కష్టమయింది. ఎలాగయితేనేం నవ్వుని అదుపులోకి తెచ్చుకున్నారు - "గొప్పవాళ్ళంటే ఏంటనుకున్నావ్? పేదవాళ్ళు పేదవాళ్ళే. ఆ పెద్ది బాగుల్ది ఎప్పుడన్నా ముత్యాలు చూసుంటే గదా పాపం, నమిలేయాలనుకుంది. ఇప్పటివరకు నువ్వు చెప్పిన కథలన్నింటిలోనూ కష్టాలు కన్నీళ్ళు ఉన్నాయి. చక్రవర్తుల కష్టాలు, అంతఃపురాల్లో మహారాణుల ఫలించని ప్రేమ గాథలు, కరుణ పూరిత కథలు యిలాంటివే చెప్పావు. కాని యింతగా నవ్వించే కథని మరొక్కటి చెప్పావంటే నీకు మంచి విలువైన సరుకు యిప్పిస్తా."

"చిత్తం అయ్యగారండీ. అవన్నీ మా తాత చెబుతూ వుంటే వినేవాణ్ణండి. అంతఃపురాలలో కుమిలి కుమిలి ఏడ్చే ఆ మహారాణుల గాథలు నా బుర్రలో ఎప్పుడూ తిరుగుతూ ఉంటాయండి. వాళ్ళ బాధలు కష్టాలు తలంచుకుంటే నా కేడుపొస్తుందండీ.... భాగ్యవంతులు నిరుపేదలవుతారు. గొప్పోళ్ళ గర్వాలు అణిగిపోతాయి. అయినా యీ లోకం పిచ్చిదండయ్యగారూ. ఆ పిచ్చిని మరిచిపోడానికే నేను తాగుతున్నానండీ లేకపోతే మెడలో ఉరితాడులాగ ఎందుకండీ యీ పాడు అలవాటు నాకు?"

జమీందారు కునుకుపాట్లు పడుతున్నారు. కుంపట్లో నిప్పులు మండుతున్నాయి. తాగుబోతు చలితో వణుకుతున్నాడు. చేతులతో వొళ్ళంతా వెచ్చబెట్టుకుంటున్నాడు. తుళ్ళిపడుతూ జమీందారు లేచారు - "సరే, యింక నువ్వెళ్ళు. నాకు నిద్రొస్తుంది. ఆ టేబిల్‌మీద రూపాయుంది. తీసుకుపో. లల్లూని రమ్మన్నానని చెప్పు"

తాగుబోతు రూపాయి తీసుకొని నెమ్మదిగా జారుకున్నాడు. లల్లూ జమీందారుగారి గుమాస్తా. లల్లూ కోసం వస్తూ ఉండగా ఓ గది దగ్గర ఏడుస్తూ వెక్కుతూన్న శబ్దం వినిపించింది. అక్కడ తాగుబోతు నిలబడి వినసాగాడు.

"గాడిద కొడుకా, ఏడుపెందుకురా? చినబాబుగారు రెండే గదరా తన్నేరు! గుండుతో పేల్చలేదు గదా?" కర్కశంగా లల్లూ అంటున్నాడు. జవాబుకి బదులుగా వెక్కిళ్లు వినిపిస్తున్నాయి. దాంతో మరింత కఠినంగా లల్లూ అంటున్నాడు-"ఒరేయ్ మధూ, వెళ్ళి పడుకో. నంగిరి వేషాలెయ్యకు. నేను లేచానంటే తొక్క లొలిచేస్తాను. తెలిసిందా?"

తాగుబోతు వింటున్నాడు. పిల్లవాడి వెక్కిళ్లు ఎక్కువయ్యాయి. మళ్ళీ వినిపించింది - "ఇక్కడ్నుంచి పోతావా, డొక్కలో తన్నమన్నావా?"

పిల్లాడు భయంతో బయటి కొచ్చేసాడు. ఆ పిల్లాడి అందమైన తెల్లని ముఖాన్ని తాగుబోతు చూసాడు. కన్నీరు కారుతూంది. పిల్లాణ్ణి ముద్దుగా దగ్గరికి తీసుకొని కన్నీరు తుడిచేడు. గేటు బయటికి తీసుకొచ్చాడు. వదవుతూంది. చలి విపరీతంగా ఉంది ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. తాగుబోతు చూపిస్తూన్న సహానుభూతిని అమాయకమైన ఆ చిన్ని హృదయం మౌనంగా స్వీకరించింది. పిల్లాడు ఏడుపు మానాడు. ఓ చిన్న సందు వద్ద ఆగగానే పిల్లాడు మళ్ళీ వెక్కసాగాడు. పిల్లాణ్ణి కుదుపుతూ తాగుబోతు అడిగాడు - "ఇప్పుడింకెందుకురా ఏడుపు?"

"ఉదయం నుంచీ ఏమీ తినలేదు."

"ఆఁ, తిన్లేదా! పెద్ద జమీందారుల దగ్గరున్నావు. నీకేమీ తినడానికి పెట్టలేదా?"

"ఆ మాట చెబుదామనే గుమాస్తా దగ్గరికెళ్ళాను. దెబ్బలిలాగూ రోజూ తింటున్నాను. ఇవాళ తిండి కూడా తినలేదు. చినబాబుగారి ఓవర్ కోటు పట్టుకొని ఆట దగ్గరే ఉదయం నుంచి సాయంకాలం వరకూ ఉన్నాను. ఏడుకొచ్చాం యింటికి. తొమ్మిది వరకూ ఆ పనీ యీ పనీ చేసాను. అంచేత పిండి ఆడించలేకపోయాను. రొట్టెలెలా వస్తాయి! గుమస్తాతో చెప్పడాని కెళ్ళాను!" ఆకలి గురించి చెబుతూ ఉండగా పిల్లాణ్ణి దైన్యం, ఆకలి - రెండూ చుట్టుముట్టాయి. మళ్ళీ వెక్కడం మొదలయింది.

తాగుబోతు పిల్లాడి రెక్క పట్టుకొని ఆ వీధిలోంచి లాక్కుపోయాడు. ఓ మురికి కొట్టు గది తలుపు నెట్టుతూ పిల్లాడితో లోపలి కెళ్ళాడు. చీకట్లో తడుముతూ అగ్గిపుల్ల గీసి కిరోసిన్ బుడ్డీ వెలిగించాడు. చిరిగిన దుప్పటి కింద వెదికితే చిన్న పరోటా ముక్క దొరికింది! పిల్లాడి చేతిలో పెట్టి — "దీన్ని తింటూ ఉండు. నీ డొక్క నింపడానికి ఏదో తేవాలిగా. ఏం వింటున్నావా? ఏడొద్దు. ఏడ్చావా చితగ్గొట్టేస్తాను. ఏడువంటే నాకు గొప్ప చిరాకు. భడవా, నన్ను కూడా ఏడిపిద్దామనే... "

తాగుబోతు వీధిలోకి వచ్చాడు. వాడి చేతిలో ఓ రూపాయుంది. పన్నెండణాల కల్లు, రెండణాల పకోడీ.......... వొద్దు. బంగాళాదుంపలు వెనగల కూర .. ఛ వొద్దు. నాల్గణాల మాంసం కూర తీసుకుంటాను. అయ్యో, రాత్రి యీ గుంటడు ఒకడున్నాడు గదా. వీడి కడుపు నింపాలి. అయినా వాడు తినేదపగా ఎంతలే!.... ఆయ్యో, యీనాటివరకు యింకొకరి గురించిన ఆలోచనే లేదు సరే యిప్పుడింతకీ ఏది కొనాలి. మొదట కల్లు తాగితే. ఈ ఆలోచనతో అతని కళ్ళల్లోకి విద్యుత్ కాంతి వచ్చింది. కాని అనుకోకుండానే అతనో మిఠాయి కొట్టు దగ్గరికొచ్చాడు కల్లు తాగాలనే సంగతే మర్చిపోయాడు. ఆ రూపాయికి మిఠాయి, ఉప్పు కారం ఉన్న గారెల్లాంటివి కొన్నాడు. పరుగు లాంటి నడకతో యిల్లు చేరుకున్నాడు. ఇద్దరూ పక్కపక్కన కూర్చొని తినుబండారాలు ముందు పెట్టుకున్నారు. వాటి సువాసనలు ముక్కుపుటాలకు తాకగానే పిల్లాడి నోరూరింది ముఖంలో చిరునవ్వు వచ్చింది.

తాగుబోతు మట్టి కుండలోంచి నీళ్ళు తీసాడు. "ఓరి గుంట నాగన్నా, నవ్వొచ్చిందిరా! సువాసన ముక్కుకి తగిలింది

కదూ! తిను. కడుపు నిండా తిను. మళ్ళీ ఏడ్చావా నాలుక హూనం చేసేస్తాను.

ఎన్నాళ్ళనుంచో కలిసివున్న మిత్రుల్లాగ యిద్దరూ పంక్తిలో కూర్చొని కడుపునిండా తిన్నారు. చెమ్మగా ఉన్న ఆ నేలమీదే పడుకొని, తాగుబోతుది పాత పెద్దకోటు తీసి ఆ పిల్లాడు తన వొంటినిండా కప్పుకున్నాడు. పిల్లాడు నిద్రపోయాక తాగుబోతు దుప్పటి ముసుగుతన్ని గొణుక్కున్నాడు - "ఏడు రోజులైె ఒక్క చుక్క గొంతులో పోసుకోలేదు. ఇవాళన్నా హాయిగా తాగి, తిని తమ్మగా నిద్ర పోవాలనుకుంటే యీ గుంటడు నాకు దాపురించేడు!"

* * *

మొట్టమొదటగా అవాళ తాగుబోతు ఆలోచన అనే వెలుతురులో కళ్ళు తెరిచి చిందర వందరగా పడిఉన్న ఆ గది లోని దారిద్ర్య విభూతిని చూసాడు. మోకాలికి గడ్డాన్ని ఆనించి కూర్చున్న పిల్లాడ్ని చూసాడు ఎంతో బాధపడుతూ తనలో తనే ప్రశ్న వేసుకున్నాడు - ఈ సుకుమార పుష్పానికి కష్టాలు కలిగించ డానికి నిర్దయను సృష్టించినదెవరో కదా! వీడ్ని పెట్టుకొని కుటుంబ జీవితం గడపమని నా నొసట రాసి ఉందా? ఇలా జరుగుతుందని నేనెన్నడూ అనుకోలేదు. దురదృష్టవంతుడ్ని! నా మమత, వ్యామోహం - ఇలాంటివాటిపై యింతవరకూ నాదా సీసాదే సర్వాధికారమున్నూ. కాని యీనాడు ఆ అధికారం వీడికి చెంది పోయింది. ఈ భడవ నా జీవితం మీద మహేంద్రజాలాన్ని ప్రయోగించనున్నాడా? అలాంటప్పుడు నే చెయ్యగలిగిందేమిగా ఏముంది? మా యిరువురి పొట్టలెలా గడుస్తాయి?.... లాభం లేదు. వీడ్నిక్కడ్నుంచి తగిలెయ్యాలి - లేదాక!

పిల్లాడు ఆవలింత తీస్తూ లేచి కూర్చున్నాడు. తాగుబోత న్నాడు - "లేరా లే. లేచి తిను. రాత్రి తినగా ఏదో మిగి లుంటుందిలే. తినేసి నీ తోవ నువ్వు చూసుకో! నీ పేరేమి టన్నావు?"

పిల్లాడు మామూలుగానే నవ్వాడు - "మధు! పళ్ళు తోము కొని మొగమన్నా కడగొద్దా తినడానికి! అయినా నేనెక్కడికి పోతాను?"

ఓహ్, ఎక్కడికి పొమ్మని చెప్పేది వీడ్ని? ఏల్లోకి పొమ్మని చెప్పాలా ... పాపం, యివాల్టి వరకు దుఃఖమనే బట్టీలో మండుతూనే ఉన్నాడు. అయితే.... తాగుబోతు మౌనంగా ఆలో చిస్తూ యింట్లోంచి బయటికొచ్చాడు. లోపల కోపంతో మండి పడుతున్నాడు.... ఒరే భడవా, నేనింత యిక్కడికి రాములేరా. నువ్వే ఉండు యీ కొట్టు గదిలో!

తాగుబోతు గోమతి ఒడ్డుకి వచ్చేడు. ప్రశాంతంగా అక్క డెన్నో విషయాలు ఆలోచించాలని వచ్చాడు కాని ఏమీ ఆలోచించలేకపోయాడు. ముఖం కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. ఎండ బాగా వచ్చింది గోమతి ప్రవాహం చూస్తూ ఎంతో సేపు గడిపాడు. ఎండ వెచ్చగా తగులుతూ ఉంటే ఆ హాయిలో తనకి కలిగిన కష్టాన్ని మరచిపోవాలని ప్రయత్నిస్తున్నాడు. అంతలో ఎవరో పిల్చినట్టయింది—

"బలేవాడివేనయ్యా, ఎక్కడున్నావ్? ఏళ్ళు గడిచాయి కనబడి! నిన్ను వెదికి వెదికి విసిగిపోయాననుకో నమ్ము."

తాగుబోతు త్రుళ్ళిపడి చూసాడు. ఎవరో తెలిసిన వ్యక్తి లాగే ఉన్నాడు. కాని ఎవరయిందీ స్పష్టంగా తెలీకుండా వుంది.

మళ్ళీ అతనే అన్నాడు - "నీతోనే మాట్లాడుతున్నాను. వింటున్నావా. తీసుకుపో సానపట్టే నీ మిషను లేదా రోడ్డుమీద గిరాటేస్తాను. నేనుండే దొకే గది. నా సామాన్లకే చోటు చాల కుండా వుంది."

"ఓ, రామ్‌జీ నువ్వా! మరిచేపోయావయ్యా, పద పద, ఇవాళే తీసుకుంటాను." తాగుబోతన్నాడు.

ఇదీ మంచికే జరిగింది. దీన్ని అమ్మేస్తే కొన్ని రోజు లన్నా గడపొచ్చు - తాగుబోతనుకున్నాడు.

గోమతిలో స్నానం చేసి ఆ దగ్గర్లోనే ఉన్న రామ్‌జీ యింటికెళ్ళాడు. సానపట్టే యంత్రాన్ని తీసుకొన్నాడు.

చాలాకాలానికి మళ్ళీ ఆ యంత్రం తాగుబోతు భుజం మీది కెక్కింది. ఇంటికి తీసుకొచ్చాడు. పిల్లాడు కూర్చొనున్నాడు.

"తిన్నావా లేదురా భడవా" అని పిల్లాడ్ని అడిగాడు.

"కడుపునిండా తిన్నాను. అదుగో నీకూ కూడా వుంచాను." అంటూ ఆ పిల్లాడు సహజమైన తియ్యని తన నవ్వుతో ఆ గదిని తడిపివేసాడు. తాగుబోతు ఓ క్షణం మౌనం వహించేడు. తర్వాత అక్కడున్నవి తిని మంచినీళ్ళు తాగాడు. ఆలోచనలో పడ్డాడు.

'దీన్నే అదృష్టమంటారు కాబోలు. సరే, యివాల్టినుంచి మళ్ళీ నేనూ నా సానపట్టే మిషనూ రోడ్డున పడతాం. దీంతో మా యిద్దరి పొట్టలూ గడిచిపోతాయి. ఆ పాత చరఖా మళ్ళీ భుజ మ్మీదికొచ్చింది. ఏదో యీ కథలూ ఆ కథలూ చెప్పుతుంటూ

**Statement about Ownership and other Particulars about Newspaper,**

## BHARATHI

Form IV [See Rule-8]

1. Place of Publication: VIJAYAWADA
2. Periodicity of Publication: MONTHLY
3. Printer's Name: S. Radhakrishna
   Whether Citizen of India: Yes
   Address: 14-14-21 Mallikharjunarao street, Vijayawada-3.
4. Publisher's Name: S. Radhakrishna
   Whether Citizen of India: Yes
   Address: 14-14-21 Mallikharjunarao street, Vijayawada-3.
5. Editor: S. Radhakrishna
   Whether Citizen of India: Yes
   Address. 14-14-21, Mallikarjuna Rao street, Gandhinagar, Vijayawada-3
6. Names and Addresses of Individuals who own the News paper and partners or share holders holding more than one percent of the total capital.
   (1) Name: S. Kamakshamma, 1, Luz Avenue, Mylapur, Madras 600 004, (2) S. Radhakrishna, Address 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, (3) Name: S. Nageswara Rao, Address: 1, Luz Avenue, Mylapur, Madras 600 004, (4) Name. S. Rajeswari, Address 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, (5) Name S. Seshamma, Address 1 Luz Avenue, Mylapur, Madras 600 004, (6) Name: G V Subba Rao, Trustee Amrutha Dharma Nidhi, Address 42-45 Luz Church Road, Madras 600 004, (7) Name S Ramayamma, Address 1, Luz Avenue, Mylapur Madras 600 004, (8) Name P Satyanarayana, Address Plot No 28, Bhagyalakshmi Nagar, (Behind Kalpana Talkies), Hyderabad 500380, (9) M/s Sambhu Prasad & Sons P Ltd 63, Rayapettah High Road, Madras 600 004, (10) Mr M S Kini, 1-9-1122/3/1, Dayananda Nagar, Hyderabad 500 004, (11) Sri V Sun-[illegible] n, No 20 First Main Road, Thiruvanmiyur, Madras [illegible] (12) Sri R Gopalakrishnan 79 Venkateswaranagar, [illegible] akkam, Madras 600 041 (13) Sri S. Sreerama-[illegible] ny 63 Rayapettah High Road, Madras 600 004, [illegible] Master S V S Arvind, 1, Luz Avenue, Madras 600 [illegible] (15) Smt P Nageswaramma, 1, Luz Avenue, [illegible] ras 600 004, (16) Dr P S N Murthy, 8-2-322, Ban-[illegible] Hills, Hyderabad, (17) Sri Venkatarao Kordale, 1-[illegible] 3/2, Gandhinagar, Hyderabad 38, (18) Smt. Ganti [illegible] Plot No 7, 146, Luz Church Road, Mylapur, Madras-4

Radhakrishna hereby declare that the Particulars given above are true to the best of my knowledge and belief

**S. RADHAKRISHNA,**
Signature of Publisher.

1-3-1990

పొద్దుపుచ్చేవాణ్ని. కాని యిప్పుడు ఏదో పనిచేసి పైసాలాని యిల్లు గడవదు.'

"ఏరా? మరి యిప్పుడెక్కడికి పోదామనుకుంటావ్?"

"ఎక్కడికి వెళ్ళను."

"ఏంటీ, యిక్కడ పోగులు పోసివున్నాయి మింగుదామనుకున్నావా! నా దగ్గర గనేం లేదు; నీకు మిఠాయి కొనిపెట్టడానికి?"

"ఏదో పని చేద్దాం?"

"చేస్తావా?"

"నీ యిష్టమే, ఏది చెబుతావో."

"సరే, యివాళ్టినుంచి నాతో మహ్వా తిరగాలి. ఈ మిషను నీ కోసమే తెచ్చాను. పద, పాన పట్టడం నేర్పుతాను కష్టాల్ని. ఎక్కడుంటామో చెప్పలేను. ఏ చెట్టు కిందో రాత్రుళ్ళు ఉండగలవా?"

"ఎక్కడన్నా ఉండగలను. ఆ జమీందారు పని మాత్రం చెయ్యలేను!"

తాగుబోతు ఒక్కసారి ఆ పిల్లాడివేపు తీక్షణంగా చూశాడు. పిల్లాడి కళ్ళల్లో దృఢ నిశ్చయపు ప్రతిజ్ఞ కనిపిస్తోంది.

తాగుబోతు మనస్సులోనే అనుకున్నాడు - 'ఏం దావొచ్చి నా నెత్తిన పడిందిరా బాబూ. ఇప్పటిక కల్లు తాగకూడదని నేను కూడా ప్రతిజ్ఞ చెయ్యాల్సి వచ్చింది గదా?

తనతోబాటు ఉంచవలసిన సామాన్లు తాగుబోతు సర్దసాగాడు. రెండు వస్తువులయ్యాయి - ఒకటి మూట, రెండోది మిషను.

"నువ్వేది పట్టుకుంటావ్?" పిల్లాడ్నడిగాడు తాగుబోతు.

"నువ్వేది చెబితే దాన్నే."

"సరే, నీ బాబొచ్చి నన్ను నిలదీస్తే?"

"రారెవ్వరూ నా తరఫున. పద. నాయనెప్పుడో చచ్చిపోయాడు."

తాగుబోతు ఆశ్చర్యంగా పిల్లాడి ముఖం చూస్తూ మిషన్ని తన భుజాలమీది కెత్తుకున్నాడు. పిల్లాడు మూట పట్టుకొన్నాడు. ఇద్దరూ ఆ కొట్టు గదిని వదిలి బయటికొచ్చారు.

# మానవసేవే - మాధవసేవ

విన్నవించుకొందునా నా కోరిక
కనువిందు సేయ ఈ వేడుక
జీవరాశులలో ఉత్కృష్టమైన జన్మనొందిన మానవా!
దురాగతాల ఊబిలో పయనించడం మానవా!
ఏ మతం అయితే నేమి
గతం పరిశీలించ వేమి
మతం పేర ఎన్నో సంగ్రామాలు జరిగాయి
మానవత గుండెలో గాయాలుగ మిగిలాయి
మతం ప్రబోధించేది ఒకటి
నీవు అనుసరించేది వేరొకటి
సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని వీడి
స్వార్థపూరిత కోర్కెల తోడి
ప్రళయాన్ని సృష్టిస్తున్నావు
గరళాన్ని అందిస్తున్నావు.
భక్తితత్పర భాసురుడవనుచు
శక్తిపై చిత్తాన్ని నిలుపుతూ
మూఢత్వంలోకి జారిపోతున్నావు
హింసాయుత చర్యలకు బూనుకొంటున్నావు.
మానవత్వం నెలకొనినచోట
జాతి అభ్యుదయానికి వేయబడతాది చక్కని బాట
ఆ బాటలోనే అందరూ పయనించాలి
అందుకై అనువిత్వం శ్రమించాలి
శాంతి పవనాలు చల్లగ ప్రవరించేందుకు
జ్యోతిర్మయి తేజోనిరతితో భాసించేందుకు
ఒక రెమ్మ పూవుల్లా
ఒక కొమ్మ కాయల్లా
మానవజాతి వికాసానికి
మధురస్మృతులై నిలవడానికి
కలిసి, మెలసి, పయనిద్దాం.
మానవసేవే మాధవసేవని నినదిద్దాం.

శ్రీ ఎస్. ఆర్. పృథ్వి

# కవితా ముద్గరం

ఏదో ఒకచోట
ఏదో "నమ్" కుల సమరం
సాగుతూనే ఉంటుంది!
స్వార్థం పెత్తందారీకి
మతం - కమతానికి
కుదురుకుంటుంది!

చీలికల ఏలికలకు
జనం భజనం
జరూరు జరుగుతూనే ఉంటుంది.
కడగళ్ళ వడగళ్ళ వానకు
జడిసిన వెట్టిదనం
వంచన పంచన
ఒళ్ళు దాచుకుంటుంది!
సిరి ముసిరిన మైకం సాచిన
కిరాతకపు కోరలు
తలరాతల చాలుగా
సరిపెట్టుకొని, పేదరికం
పెదవి చిదుముకుంటుంది,

అప్పుడు,
నిజం ఖనిజంతో చేసిన
నా
కవితా ముద్గరం-
చీకట్ల గట్లు తెగతెంపి
వెలుతురు ఏరుల్ని
ఎదనిండా పొంగించి
పచ్చని బ్రతుకుల్ని
పండిస్తుంది.
ఫలితం సరిసమంగా
అందిస్తుంది,
నా "కవితా ముద్గరం"
జన హితైక భావనోద్గతం.

శ్రీ మంగళగిరి పూర్ణచంద్

డా॥ కావు రామాంజనేయులు

# రాయవాచక భాషపై కన్నడభాషా ప్రభావం

భావ ప్రసార సాధనం భాష. దీనికి లిపి ఏర్పడిన తర్వాత రెండు రూపాలుగా కనిపిస్తుంది. ఒకటి లిఖిత రూపం (రిటన్ ఫార్మ్), రెండోది వ్యవహార రూపం (స్పోకెన్ ఫార్మ్). వ్యవహార భాషకు వేరే భాషా సమాజాలతో సాన్నిహిత్య మేర్పడినపుడు (భౌగోళికంగా) ఆ భాషల మధ్య పరస్పర ప్రభావం ప్రసరిస్తుంది. ఆ ప్రభావం కేవలం పదజాలంపైన మాత్రమే కాక ఒక్కోసారి భాషా నిర్మాణంపై కూడా ప్రసరించే అవకాశం ఉంటుంది.

తెలుగు భాషకు కన్నడభాషా సమాజంతో మొదటినుంచి భౌగోళికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా సన్నిహిత సంబంధా లున్నందువల్ల భాషా సాహిత్య రంగాల్లో చెప్పుకోదగ్గ ప్రభావం గోచరిస్తుంది. ఈ ప్రభావాన్ని మనం నన్నయ కాలం నుండి చూడవచ్చు. నన్నయ పద్యాల ఎత్తుగడలను బట్టి, ఆయన ప్రయోగించిన కొన్ని పదబంధాలను బట్టి నన్నయ పంపకవి 'విక్రమార్జున విజ'యాన్ని అనుసరించినట్లు సాహిత్య పరిశోధకులు పేర్కొంటారు.[1] నన్నయ తర్వాత శివకవులైన పాల్కురికి సోమనాథుడు, పండితారాధ్యుడు మొదలైనవారు ఆంధ్ర సాహిత్యంపై ప్రగాఢమైన ముద్ర వేశారు. వీరు కన్నడాంధ్ర భాషల్లో సవ్యసాచుల్లా రచనలు చేసి శైవమతాన్ని బాగా ప్రచారం చేశారు.

విజయనగర కాలంలో ఆంధ్రదేశం కర్ణాటకతో బాగా పెనవేసుకుపోయింది. శ్రీకృష్ణదేవరాయలు కర్ణాటాంధ్ర భూభాగాల్ని పరిపాలించడమే కాకుండా కన్నడాంధ్ర భాషా సాహిత్య సంస్కృతులను బాగా పరిపోషించి అటు 'కన్నడ రాయడు' గాను, ఇటు 'ఆంధ్ర సాహితీ సమరాంగణ సార్వభౌముడు' గాను కీర్తి గాంచాడు. అంతేకాదు. అతని ఆస్థానంలో (భువన విజయం) తెలుగు కవులతోపాటు (అష్టదిగ్గజ కవులు) కన్నడ కవులు కూడా ఉండేవారని ప్రతీతి.[2] కన్నడకవి రుద్రభట్టు 'జగన్నాథ విజయా'నికి సమాంతరంగా తెలుగులో నంది తిమ్మన 'పారిజాతాపహరణ' కావ్యాన్ని వెలువరించడం ఈ రెండు భాషల సంబంధ బాంధవ్యాలను సుబోధకం చేస్తుంది. ఇలా సమాంతరంగా అనేక గ్రంథాలు వెలువడడం మాత్రమే కాక సాహిత్య ప్రక్రియలలోను, సాహిత్య ఉద్యమాలలోను అనేక పోలికలు కనిపిస్తున్నాయి. ఈ నేపథ్యంతో చూసినట్లయితే విజయనగర కాలంలో వెలువడిన రాయవాచకంపై కన్నడభాషా ప్రభావం స్పష్టమవుతుంది.

విజయనగర కాలంలో విజయనగరం (హంపి) కేంద్రబిందువుగా పరిపాలన కొనసాగేది. ప్రజల రాకపోకలకు అది కూడలి స్థలం. తెలుగు కన్నడ భాషలకు ఆటపట్టు. రెండు భాషలూ సమాన గౌరవాన్ని పొందేవి. శాసనాలు రెండు భాషల్లోనూ చెక్కబడ్డాయి.[3] ఒకే శాసనంలో రెండు భాషల్ని ప్రయోగించడం కూడ చూడవచ్చు. దీన్నిబట్టి చూస్తే ఆ భాషలు ఒకదానితో ఒకటి ఎంత అవినాభావ సంబంధాన్ని కలిగి వున్నాయో తెలుసుకోవచ్చు.

రాయవాచక భాషను నిశితంగా పరిశీలిస్తే ఆ భాషలో కన్నడ భాషా పదజాలం మాత్రమే కాక ఆ భాషా నిర్మాణ ప్రభావం కూడా ఉన్నట్లు ద్యోతకమవుతుంది. రా. వా. కర్తకు రెండు భాషలూ తెలిసినందువల్ల తన రచనలో కన్నడ భాషా ప్రభావం అనివార్యమైంది

ఉచ్చారణ :

రాయవాచకంలో కొన్ని పదాల్లో కన్నడోచ్చారణ ప్రభావం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. సాధారణంగా కన్నడ భాషలో ణ, ళ వర్ణాల ప్రయోగం చాల ఎక్కువ. తెలుగులో

పారూప్య పదాల్లో అవి న, ల లుగా కనిపిస్తాయి. అలాంటప్పుడు తెలుగులో ణ, ళ లు ఉన్నాయంటే అది కన్నడ భాషా ప్రభావ మని నిశ్చితంగా చెప్పవచ్చు.

ఉదా : అణ్ణగర్లు [26-6] / అణ్ణగళుల [27-6]
దివాణం [36-21] [<దివాన్]
మళయాళం [3-11] తె. మలయాళం
కళ్యాణం [11-21] తె. కల్యాణం
స్థళం [67-2] తె. స్థలం

ణ, ళ లు ప్రయుక్తమైన కన్నడ పదాలు, న, ల లు ప్రయుక్తమైన తెలుగు పారూప్య పదాలను కొన్నిటిని ఈ క్రింద చూడవచ్చు.

| ణ | | ళ | |
|---|---|---|---|
| క. అణ్ణ; | తె. అన్న | క. గాళి; | తె. గాలి |
| క. కణ్ణు; | తె. కన్ను | క. చళి; | తె. చలి |
| క. సుణ్ణ; | తె. సున్నం | క. ఉళి; | తె. ఉలి |
| క. బెణ్ణె; | తె. వెన్న | క. మొసళె; | తె. మొసలి |
| క. కాణికె; | తె. కానుక | క. హళ్ళి, | తె. పల్లి/పల్లె |
| క. చిణ్ణ; | తె. చిన్న | క. ముళ్ళు; | తె. ముల్లు |

పదజాలం :

ఒక భాష నుండి మరో భాషలోనికి పదజాలం ప్రవేశించ డానికి అనేక కారణాలుంటాయి. భాషా వ్యవహర్తకు వేరే భాషతో ఉన్న నిత్య సంసర్గం వల్లనో లేక ప్రతిష్ఠాత్మకంగా భావించడం వల్లనో తన భాషలో ఆ భాషా పదాలు చోటు చేసుకుంటాయి. కేవలం పదాలు మాత్రమే కాక పదబంధాలు, పలుకుబళ్ళు, సామెతలు, వ్యాకరణాంశాలు కూడా ప్రయుక్తం కావచ్చు. ఇవి యథాతథంగా రావచ్చు. లేక కొద్ది మార్పులతో రావచ్చు. ఒక్కొ-సారి విశేషార్థంలో ప్రయోగించవచ్చు. రా.వా.లో వాక్య నిర్మాణంలో కూడా కన్నడ భాషా ప్రభావం గోచరిస్తుంది.

పదాలు :

అప్ప : ఇది నేటికీ కన్నడ పరిహద్దు ప్రాంతాల్లో మాత్రమే ఎక్కువగా వినిపిస్తుంది. ఇది అనేకార్థాలలో ప్రయోగింపబడుతుంది. వ్యక్తి నామాలకు చివర, పూజ్యార్థంలో, సంబోధనలో, 'నాన్న' అన్న అర్థంలో వాడబడుతుంది. శ్రీకృష్ణదేవరాయలు తన ప్రధానమంత్రి అయిన తిమ్మరుసును 'అప్పాజీ' అని పిలిచేవాడు. తిమ్మరుసు ఎల్లప్పుడు తండ్రిలా రాయల వెంట ఉండి అన్ని సమస్యల్ని తన తెలివితేటలతో పరిష్కరించేవాడు. గనక రాయలు కూడా తిమ్మరుసును తండ్రికంటే అధికంగానే భావించేవాడు. కన్నడంలో 'అప్ప' అన్న సంబోధనా రూపానికి పూజ్యార్థంలో 'జి / జీ' అనే మరాఠీ ప్రత్యయం చేరి 'అప్పాజీ' అన్న రూపం ఏర్పడింది. ఇది తిమ్మరుసుకు మరో పేరుగా వ్యవహరింపబడింది. రా వా. లో దీనికి అనేక ఉదాహరణలు చూపవచ్చు.

ప్ర. అప్పుడు అప్పాజీ మాటలు వినక వచ్చినందుకు ఇంత కార్యం వచ్చెను (69-2)

అప్పాజీ మాటలు వినక లోజొచ్చి వచ్చినందువల్ల అపాయం వచ్చెననిన్ని యిందుకు యిప్పుడైనా అప్పాజీ చెప్పినట్టు వింటే ఆయన అపాయానకు తగ్గ ఉపాయం చింతించ గలడనిన్ని (69-15)

అప్పాజీ రాయలవారు వచ్చేది.... (69-19)

'అప్ప' అనేది వ్యక్తి నామాంత్యపదంగా కూడా రా. వా.లో వాడబడింది.

ఉదా : బోయి రామప్ప (44-17)
కొమార తిమ్మప్ప (44-19)

నామాంత్య ప్రత్యయాలుగా ఆయా కులానికి లేక జాతికి (వర్గానికి) చెందినవి ఈ 'అప్ప' తర్వాత ప్రయుక్తమయ్యాయి.

ఉదా : గణుతి తిమ్మప్ప నాయడు (44-16)
అయ్యప్ప నాయడు (44-20)
అక్కప్ప నాయడు (44-21)

కాసు : ఇది కన్నడంలో ఎక్కువగా ప్రయోగింపబడుతూంది. తెలుగులో విరళంగా దీని ప్రయోగం కనిపిస్తుంది.

క. నన్నత్ర కాసిల్ల 'నా దగ్గర డబ్బు లేదు'
క. అవను కాసిగె తరవల్ల 'వాడు పైసాకు తరం కాడు' (ఎందుకూ కొరగాడు)
తె. నాకు కాసింత ఇస్తావా!

తెలుగులో సమస్తపదంలో మాత్రమే వాడుకలో ఉంది. రా. వా. లో ఇది వ్యస్తంగా ప్రయోగింపబడింది.

ప్ర. వసలం ప్రాయులు, మేకలు గొర్రెలు గుర్రాలును పట్టుక వచ్చి కానుకు వకటి అమ్మేది [59-4]

శ్రీకృష్ణదేవరాయలు తురకలను జయించినపుడు అక్కడ దొరికినవాటిని అతి తక్కువ వెలకు అమ్మేవారని చెప్పేటప్పుడు ఈ అభివ్యక్తి (ఎక్స్‌ప్రెషన్) వ్యక్తమైంది.

స్తోమము : కన్నడంలో 'జనస్తోమ' అన్న పదబంధం 'జనుల గుంపు, జనబలం' అన్న అర్థాల్లో నేటికీ వాడుకలో ఉంది. రా.వా.లో ఈ అర్థంలోనే వ్యస్తంగా ప్రయుక్తమైంది.

ప్ర. దొరమన్నీల అందరినిన్ని తమ తమ స్తోమముల తోదట్టు క్షిప్రగతిగా రమ్మని (27-12)

చికాపురామని తెగలో యిరువై మూడువేల స్తోమమున్ను నాల్గువేల గుర్రమున్ను వజీరాపున్ను మడిపి (65-18)

ఆ తమమల్లో ముప్పైవేల స్తోమాన్ని తాణ్యం వుంచి (65-20)

ఇక్కడ 'సైన్యం' అన్న అర్థం కూడా తీసుకోవచ్చు. తెలుగులో నేడు వాడుకలో ఉన్న 'స్తోమత' అన్న పదం ఈ 'స్తోమం' నుండి వచ్చిందని చెప్పవచ్చు. దీనికి 'ధనబలం, జన బలం' అన్న విస్తృతార్థం ఏర్పడింది.

పదబంధాలు :

వీటిలో జంటపదాలే ఎక్కువగా కనిపిస్తాయి. కన్నడ పదబంధాల సామ్యంతో ఏర్పడినవి కూడా ఉన్నాయి.

అంక్క వంక్కలు : ఇది కన్నడంలో 'అక్కపక్క' అని వాడబడుతోంది. దీనికి 'ఇరుగు పొరుగు' అని అర్థం.

ప్ర. అక్కపక్కదవరు చన్నాగిద్దారా? 'ఇరుగు - పొరుగువారు బాగున్నారా?'

రా.వా.లో ఇది అనునాసిక యుక్తంగా ప్రయోగింప బడింది దీనికి 'సమీపం, సన్నిధి, దగ్గర' అన్న అర్థాలు చెప్పుకోవచ్చు.

ప్ర. రాయలవారు తన దొరతనమేమి అనంగా యేంది తన అంక్కవంక్కలకు యెవరు వచ్చేరు. రానివారిని మేము యేమి జెప్పేము [28-8]

కడ్డి కవళములు :

ఇది కన్నడంలో 'కడి కవళ' అని నేడు అతి విరళంగా ప్రయుక్తమవుతోంది. ఆధునిక తెలుగు భాషలో ఇది ఎక్కడా వినిపించదు. 'కబళం' అన్న పదమే 'కవళం'గా వాడబడింది. (వబయోరభేదః) 'కవళం' అంటే 'ఆహారం' అని అర్థం. 'కడి' అన్నా 'కబళం' అని నైఘంటికార్థం.[5] ఈ 'కడి'యే 'కడ్డి' అయిఉండవచ్చు లేక 'గడ్డి' 'కడ్డి'గా వ్రాసి ఉండవచ్చు. రా.వా.లో గుర్రాలకు పెట్టే ఆహారానికి 'కడ్డి కవళములు' అని వాడబడింది.

ప్ర. ఆయాలాయం గుర్రాలకు కడ్డికవళములు పరామరశించే టట్టు [30-26]

ఇక్కడ 'కవళ'మంటే గుర్రాలకు పెట్టే గుగ్గిళ్ళు అని, 'కడ్డి' అంటే 'గడ్డి' అని అర్థాన్వయం కుదురుతుంది.

కానుక కప్పములు :

సామంతరాజులు రాజుల కొసంగే పన్ను మరియు కానుక లకు కన్నడంలో 'కప్పకాణికెగళు' అని ప్రయోగించేవారు. 'కప్పం' అన్న పదానికి నేడు వాడుక లేదు. రా.వా.లో 'కానుకలు' అన్న అర్థంలో ఈ పదబంధం ప్రయుక్తమైంది. రా.వా. కర్త కన్నడ భాషలోని పై పదబంధ సామ్యంతో తెలుగు మార్పు చేసి ప్రయోగించినట్లు కనిపిస్తుంది.

ప్ర. ఆ రాజ్యంలో వుండే స్వామికి తమ రాజ్యములో పెద్ద బుద్ధిశాలులు బ్రాంహ్మలు యతీశ్వరులు మఠాధిపతులు రాజులు మొదలైన వారలందరున్ను కానుక కప్పములు కొంచుబోయి స్వామికి సమర్పించి వస్తావున్నారు. [55 - 24]

ధాన్య దవసములు :

కన్నడంలో 'దవస' మంటే ఆహారానికి ఉపయోగించే బియ్యం, రాగులు, జొన్నలు, సజ్జలు మొ॥వి. 'ధాన్య' మంటే పప్పు దినుసులు (కందులు, పెసలు మొ॥న నవధాన్యాలు). తెలుగులో 'ధాన్య' మంటే వరిధాన్యం మాత్రమే కాక నవధాన్యా లను కూడా విపులంగా పేర్కొంటున్నాయి. తెలుగులో నేడు 'దవసం' అన్న పదం వినిపించదు. అందువల్ల 'ధాన్య' మన్న పదమే విస్తృతార్థంలో వాడబడుతూంది. రా.వా.లో ధాన్యానికి, దవసానికి మధ్య భేదం ఉన్నట్లు స్ఫురిస్తుంది.

ప్ర. వారికిములో మన తెగలవాళ్లు లోకొచ్చి మూడామడకు మూడామడ వుండ్డే గ్రామాదులు కొళ్ళబెట్టేదింన్ని పాతరలు శోధించి ధాన్య దవసములు యెత్తేదింన్ని [59-2]

మాట పలుకులు :

ఇది కన్నడంలోని 'మాతుకతె' అన్న పదబంధ సామ్యంతో ఏర్పడింది. దీనికి 'సంభాషించు, మాట్లాడు' అన్న అర్థం ఇక్కడ సరిపోతుంది. కన్నడంలో 'నిర్ణయం/నిర్ధారణ' అన్న అర్థంలో కూడా 'మాతుకతె' అన్న పదబంధం ప్రయోగింపబడుతుంది. నన్నమగళన మదువె విషయదల్లి మాతుకతె ఎల్లా ఆయితు. 'నా కూతురు పెళ్ళి విషయంలో అంతా నిర్ణయమైంది' అంటే 'మాట్లాడుకోవడం' అంతా అయిందన్న మాట. రా. వా. లో ఈ అర్థంలో వాడలేదు.

ప్ర. మాటికి పతకంబులున్ను వెయ్యింటికి వక పంతితుడున్ను లక్షకు వకడు వక్తృంద్రై పథాస్థలిని మాటపలుకు లాడును. [32 - 13]

సంబళం సారికెలు :

కన్నడంలో 'సంబళ' మంటే 'జీతం' అని, 'సారిగె' అంటే 'రవాణా' అని అర్థం. రా. వా. లో 'జీతభత్యాలు' అన్న అర్థంలో పై పదబంధం ప్రయుక్తమైంది. 'సారిగె' అన్నది 'సారికె'గా వ్రాయబడింది.

ప్ర. ఆయా గుర్రాల రౌతులకు మావటీలకున్ను సంబళం సారికెలు కట్టడచేసి [30-28]

కోట కొత్తళములు :

కన్నడంలో 'కొత్తళ' మంటే 'బురుజు' అని అర్థం. తెలుగులో ఈ 'కొత్తళ' మనే మాట వాడుకలో లేదు. రా.వా.లో కన్నడ ప్రభావంతో 'కోట కొత్తళములు' అని ప్రయోగింపబడింది.

ప్ర. మంచి ముహూర్తాన శంకుస్థాపనం చేసి వాస్తు పురుషుని నిలిపి నగరికి స్థలం యేర్పరచి నగరున్ను దేవళమున్ను కోట కొత్తళములున్ను నవ ద్వారములున్ను ఏర్పరచి.... [10 - 3]

సర్వనామాలు :

కన్నడంలో అత- అనేది దూరవర్తిని నిర్దేశించే ప్రథమ పురుష సర్వనామం. ఈత- అనేది సమీపవర్తిని నిర్దేశించే సర్వనామం. తెలుగులో ఆదిదీర్ఘం హ్రస్వమై, -డు ప్రత్యయం చేరి అతడు, ఇతడు అన్న రూపాలు ఏర్పడుతాయి. కాని రా. వా. లోని యీతండు, అతగాడు అనేవి కన్నడభాషా ప్రభావంతో వచ్చినవిగా శంకించవచ్చు.

ప్ర. యీతండు మా స్వరూపం తెలిసినది మొదలు అని జ్ఞాన దృష్టిని జూచి [7 - 13]

ఆయనవద్ద గిండి బెట్టుక వుండగా అతగానికి యెదురుకాపూ అనే పేరు వచ్చెను [46- 21]

సంఖ్యా వాచకాలు :

సంఖ్యా వాచకాల్లో కాలు, ముక్కాలు అనే పదాలు కన్నడ ప్రభావంతో తెలుగులోకి వచ్చాయి. సాధారణంగా ఇవి జడ వాచకాలకు మాత్రమే వాడుతారు. కాని, రా.వా.లో 'కాలు' అనేది మనుష్యవాచక విశేష్యానికి విశేషణంగా ప్రయుక్తమైంది.

ప్ర. అర పేట కాలు పేద మనుష్యులయిన వారికి పోను రాను శక్యమా అని.... [42 - 26]

పండ్రెండ్లు యేండ్లకు వొకసారి మూడు ముక్కాలు ఘడియ [40 - 22]

'నూరు' అనే పదం ప్రాచీన కాలం నుండి తెలుగులో ఉన్నా దీనికి బహువచన సంఖ్యావాచక విశేషణం చేరినపుడు బహువచన ప్రత్యయం-లు రాకపోవడం కన్నడభాషా ప్రభావమని చెప్పవచ్చు.

మున్నూరు (11.5) ఆర్నూరేండ్లు (11.1) యేనూరు యేనుగలు [31 - 5]

తెలుగులో సంఖ్యావాచక విశేషణం బహువచనంలో ఉన్నప్పుడు దానికి సంబంధించిన నామవాచకం (విశేష్యం) కూడా బహువచనంలో ఉంటుంది. కాని రా.వా.లో ఏకవచనమే ప్రయుక్తం కావడం కన్నడ భాషా ప్రభావం వల్లనే.

ప్ర. షోడశ పాత్రులున్ను తామున్ను నిత్యసారిగా రెండ్లామడ మూడామడ దూరం పోయి [49 - 10]

కన్నడంలో నాల్కారు, హత్తారు, మూరారు, హావిరారు అన్న పలుకుబడులు చాల ప్రసిద్ధంగా ఉన్నాయి. కాని రా.వా.లో నాలుగారు ఘడియలు, నాలుగార్లు దినములు, వెయ్యారులు అని ప్రయోగించడం కన్నడ భాషా ప్రభావంతోనే అన్నది రూఢమవుతుంది.

ప్ర. నాలుగారు ఘడియలు ఆలోచన చేయగా [28 - 12]

నాలుగార్లు దినములు వెనుక పరుడు స్థలాలు చూచే నిమిత్యముగా [36 - 5]

జగన్నాయకులను పూజించే అర్చకులకు వెయ్యారులు లంచమిచ్చి [56 - 6]

**కారక ప్రయోగాలు :**

అపాదాన కారకంలో -నుంచి అనే ప్రత్యయం కన్నడం లోని - యింద ప్రత్యయ సామ్యంతో వచ్చింది.

ప్ర. విన్నుంచి కర్నాటకాన వళ నగరం కానున్నది.
[7 - 18] [క. విన్నింద]

మమ్ము నుంచి నీకు అయ్యే ప్రయోజనమున్న ....
[19 - 16] [క. నమ్మింద]

యీ బహుమానం మీది గనక మిమ్ముననుండి మానవము లున్న [59 - 22] [క. నిమ్మింద]

సంప్రదాన కారకంలో -కు ప్రత్యయం చేరినపుడు నగాగమం రాకపోవడం కన్నడ భాషా ప్రభావమే.

ప్ర. ఆ పిమ్మట నిందు కొలువుకు వచ్చినవారై [4 - 9]
[క. ఓలగక్కె]

విన్న కార్యము లన్నియు మనస్సుకు దెచ్చుకొని [22-5]
[క. మనస్సిగె]

సేతువుకు బోయి రామనాథుల దర్శించ్చి [42 - 8]
[క. సేతువిగె]

కన్నడంలోని -అల్లి అనే అధికరణార్థక ప్రత్యయ సామ్యంతో రా.వా.లో - అందు అనే ప్రత్యయం వాడబడింది.

ప్ర. వణనాటి యందున విశేషమైన బుద్ధి మార్గములుగా
[28 - 18] [క. బందు దివదల్లి]

అంచునుండి శ్రీరంగపట్టం కోటకై చీలి [58 - 14]
[క. అల్లింద]

**క్రియా రూపాలు :**

రా. వా. లో కొన్ని క్రియారూపాల్లో కూడా కన్నడ భాషా ప్రభావాన్ని స్పష్టంగా చూడవచ్చు. కొన్నిచోట్ల ప్రధాన క్రియలోను, కొన్నిచోట్ల సహాయక క్రియలోను ఈ ప్రభావం పాక్షికంగా కనిపిస్తుంది. కొన్ని క్రియా ప్రయోగాల్లో సామ్యత కనిపిస్తుంది.

**మించి వచ్చు :**

'అధిగమించివచ్చు'. ఇక్కడ ప్రధానక్రియలో కన్నడ ప్రభావం కనిపిస్తుంది.

ప్ర. అంతలో ఆ మొగలాయి గుర్రాలు ఆ మట్టున నిలువక వెంబడించ్చుక రాంగా గజపతివారు జూచి గుర్రాలు మించి వచ్చెను. [53 - 18]

**ఇడుకొను :**

ఇది 'పెట్టుకొను, ఇరికించుకొను, ఉంచుకొను' అన్న అర్థాల్లో ప్రయుక్తమైంది.

ప్ర. జగడములో రాతు రాతున చంక్క ఇడుకొని [55 - 10]
గుర్రాని కొరల ఇడుకొని [54 - 20]

**తిరుగాడు :**

ఇక్కడ సహాయక క్రియలో కన్నడ భాషా ప్రభావం గోచరిస్తుంది.

ప్ర. మనిషి సంచారం లేక తిరుగాడుతా వుండేటందులకు
[52 - 11]

'ఆడు' అన్న సహాయక క్రియ కన్నడంలో ప్రచురంగా ఉంది. ఇది నేడు కన్నడ సరిహద్దు ప్రాంతపు తెలుగులో మాత్రమే వాడుకలో ఉంది.

-చేయు: ఈ సహాయక క్రియ కన్నడ భాషలోని '-మాడు' అన్న సహాయక క్రియ సామ్యంతో ఏర్పడింది.

ప్ర. విప్రవరుల దర్శనంబు జేసిన పిమ్మట [2 - 13]
[క. దర్శనమాడి]

రాయలవారికి విన్నపంజేసి [3-27] [క. విన్నహం మాడి]

త్రిరాత్రులున్ను వాసము జేసి [77-26] [క. వాసమాడి]

కొన్నిచోట్ల ఆత్మార్థకంలో కనిపించే -కొను అన్న ప్రత్యయం కన్నడ భాషా ప్రభావంతో సామ్యం కారణంగా వచ్చి చేరింది.

ప్ర. కృష్ణరాయలు.........రత్నకంబళి మీద కూర్చుండుకొని
[12 - 14] [క. కూతొక్కొండు]

బహువేగాన గుర్రాంన్ని యెక్కుకొని షోడశ పాత్రుల తోడట్టు యేరుదాటి [53 - 20] [క. హత్తికొండు]

కాలబోధలో కర్త్రర్థకంలో కనిపించే '-తా' అనే ప్రత్యయం కన్నడ భాషా ప్రభావంతో తెలుగులో చోటు చేసుకుంది.

ప్ర. ముద్ర కర్తలు వొకటికొకటి కొదవ లేకుండా నడుపుతా వున్నారు [3 - 1]

మాట యొవిమిది తిరుపతులున్ను నిత్యోత్సవములుగా నడుస్తా వున్నది. [3 - 2]

**క్రియా విశేషణాలు:**

కొన్ని క్రియా విశేషణాల్లో కన్నడ ప్రభావం కనిపిస్తుంది.

**వొంటిగా :**

'ఒంటరిగా'. ఇది నేటికీ రాయలసీమలోను, తెలంగాణా లోను కొన్ని ప్రాంతాల్లో (కన్నడ భాషా స్పర్శ ఉన్న చోట్ల) వ్యవహరింపబడుతోంది.

ప్ర. కోట వెలుపట వొంటిగా పోగా [26-25] [క. ఒంటియాగి]

**యథావత్తుగా :**

'యథాతథంగా'. ఇది నేటి తెలుగులో ఎక్కడా వినిపించదు. కన్నడంలో బాగా ప్రచురంగా ఉంది.

ప్ర. స్వామివారు నిన్న రాత్రి నగరు శోధనకు బయలు వెరిపి వచ్చే యిచ్చటికి విచ్చేసిన మార్గము తెలియక యథావత్తుగా నగరికి పోయి [27-6] [క. యథావత్తాగి]

**వాక్య నిర్మాణం :**

రా.వా.లో వాక్య నిర్మాణంలో పరిమితం కొన్ని చోట్ల కన్నడభాషా ప్రభావం కనిపించడం విశేషం.

తెలుగులో నామవాచకాల కనుగుణంగా క్రియల్లో కూడా ఏకవచన, బహువచన బోధకత లింగ ప్రత్యయాల ద్వారా వ్యక్తమవుతుంది. ఇది వ్యతిరేకార్థంలో కూడా క్రియలో ప్రతిఫలిస్తుంది. కాని, కన్నడంలో 'ఇల్ల' అనే వ్యతిరేకార్థక క్రియ లింగ భేదం లేకుండా నామవాచకా లన్నిటికీ చేరుతుంది ఈ ప్రభావం మనకు రా.వా.లో కొన్ని చోట్ల కనిపిస్తుంది.

ప్ర. సామంత రాచకార్యములు విశేషములుగా లేదు [3-20] ['లేవు' అని ఉండాలి]

అలాగే పరిమాణార్థకంలో కన్నడంలోని 'ఎల్లా' (అంతా, అన్నీ) అన్న ప్రత్యయ సామ్యంతో రా.వా.లో 'అంతా' అన్న ప్రత్యయం ప్రయుక్తమైంది.

ప్ర ఆ సీతులంతా అప్పాజీ మొదలయిన వారలచేత చెప్పగా విని [20-11] ['ఆ సీతులన్నీ' అని ఉండాలి]

'ఎల్లా' అన్న కన్నడ ప్రత్యయమే రా.వా లో 'సమస్తం' (తొటాలటి) అన్న అర్థంలో అనేకచోట్ల గ్రహింపబడింది.

ప్ర. దుర్గములలో వుండే వాళ్లెల్లా జతనమై వున్నారనిన్ని విన్నపం చేయంగా [59-6]

తనతో కూడ నడిచేవారెల్లా పడపండ్లా తక్కినవారెల్లా బాయిలో విలువుడా [59-25]

అభిప్రాయ ప్రకటనలో 'సరి' అనే పదం కన్నడ ప్రభావంతో వచ్చినదే.

స్వామివారు ఆనతిచ్చిన కార్యం ఉచితమే సరి. పెద్దలు ఏలిన రాజ్యములు తొక్కి చూడవలెను [20-18]

ఈ విధంగా రా వా.లో అనేకాంశాల్లో కన్నడభాషా ప్రభావం గోచరిస్తుంది.

## సంకేతాలు :

ఉదా = ఉదాహరణ; క = కన్నడం; తె = తెలుగు; ప్ర = ప్రయోగం / ప్రయోగాలు; రా. వా = రాయవాచకం; < = నుండి పరిణమించింది; / = లేక.

బ్రాకెట్లలోని అంకెలు వరుసగా రాయవాచకం (1982) లోని పుట, పంక్తులను తెలియజేస్తాయి.

## పాదసూచికలు :

1) వెంకటరావు, నిడదవోలు, 'తెలుగు కన్నడముల పరస్పర సంబంధము', విజ్ఞాన సర్వస్వము 3, పుట-6.
2) వెంకట రామప్ప, కె; శ్రీకృష్ణదేవరాయన కాలద కర్నాటాంధ్ర సాహిత్య సమీక్షె (కన్నడం), పుట-2.
3) విజయనగర శాసనాలు, పుటలు-189-150.
4) రాయవాచకము (1982), పుటలు, 65-75.
5) బ్రౌన్, సి. పి తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు, పుట-235.

## సంప్రదించిన గ్రంథాలు :

1) బ్రౌన్, సి. పి; తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు, ఎ. ఇ. ఎస్. పబ్లికేషన్స్, న్యూఢిల్లీ, 1986.

2) రామారావు, మారేమండ. కర్నాటక - ఆంధ్ర రిలేషన్స్, కన్నడ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్, కర్నాటక యూనివర్సిటీ, ధార్‌వాడ్, 1974.

3) వీస్‌రిచ్, ఉరైల్ లాంగ్వేజెస్ ఇన్ కాంటాక్ట్, మౌటన్ కం; హేగ్, పారిస్, 1974.

4) నాగభూషణరావు, కల్లూరు: రాయలసీమ మాండలికం-అనంతపురం ప్రాంతీయత, డి. ఎల్. ఎ. ప్రచురణ, అనంతపురం, 1972.

5) రామాంజనేయులు, కె : రాయవాచకం - భాషా సాహిత్య పరిశీలన, పి హెచ్.డి సిద్ధాంత వ్యాసం (అముద్రితం), శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం, 1987.

6) వెంకట రామప్ప, కె : శ్రీకృష్ణదేవరాయల కాలపు కర్నాటాంధ్ర సాహిత్య సమీక్ష, మైసూరు విశ్వవిద్యాలయం, మైసూరు, 1974.

7) సోమశేఖర శర్మ, మల్లంపల్లి ఇతరులు: విజ్ఞాన సర్వస్వము, సంపుటం-3, తెలుగు భాషా సమితి, హైదరాబాదు, 1959.


## "అక్షరాలు కనిపించడంలేదు"

భాషలోని
అక్షరాలు కనిపించటం లేదండీ!

అన్ని పత్రికాఫీసులకు
రిపోర్టులు పంపండి
అన్ని పత్రికలలో
ప్రకటనలు వేయించండి!

అసలు
కనిపించకపోవటానికి
కారణ ముందండి

అది - ఆ మధ్య
అవినీతి - అన్యాయాలకు
భాషలోని అక్షరాలకూ
స్వల్పమైన
అభిప్రాయ భేదాలొచ్చి
తగవులాడుకున్నవటండి-

ఎందుకేమిటండీ

అక్షరాలన్నీ కలిసి
(సంఘీ)భావంగా యేర్పడి
అవినీతి - అన్యాయాలని
విప్లవ కవుల ద్వారా
దుయ్యబట్టినవటండీ

అప్పటినుండీ
వాటిమధ్య వైరం పెరిగింది.

అందుకే
మాకు అనుమానం
అవినీతి - అన్యాయాలపైన

అవియే
భాషలోని అక్షరాలని
దాడిచెయ్యడం కాని-
హత్య చెయ్యడం కాని
జరిగి ఉంటుందని
ఊహాగానాలు కూడా వచ్చాయి!

అందుకే
అందరికీ హెచ్చరిక.

భాషలోని
అక్షరాలు కనపడితే
వల వేసి పట్టండి
మా కప్పచెప్పండి,
బహుమానం పొందండి.

శ్రీ టి. శ్రీనివాసాచార్యులు

డా॥ ఏ. సిమ్మన్న

# బాపిరాజు సాహిత్యంలో అన్యదేశ్యాలు

అసలు ఏ భాషలోనైనా పదాలు రెండు రకాలు. ఒకటి దేశ్యాలు, రెండు అన్యదేశ్యాలు. మూల భాషల నుంచి సంక్రమించేవి దేశ్యాలు, మిగిలినవి అన్యదేశ్యాలు. ఒక భాష వేరొక భాష నుంచి పదాలు స్వీకరించడాన్ని భాషా శాస్త్రజ్ఞులు 'ఎరువు' అంటారు. ఒక భాష వేరొక భాష నుంచి పదాల్ని ఎరువు తెచ్చేటప్పుడు స్వభాషావర్ణ నిర్మాణానికి అనుకూలమైన పద్ధతిలో పదాల్ని కూర్చుకొని తనలో నిబిడీకృతం చేసుకుంటుంది.

ఆంధ్ర వాఙ్మయంపై అన్యభాషల ప్రభావం మొదటినుంచి బాగా కనబడుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే అన్యభాషల ప్రభావం లేని భాష అంటూ ఏదీ ఈ ప్రపంచంలో లేదు. ప్రతి భాషపై అన్యభాషల ప్రభావం కొట్టవచ్చేటట్లు దర్శనమిస్తుంది. ఇది ఏ భాషకు మినహాయింపు కాదు. ఎంత ఎక్కువగా అన్య భాషా పదాల సంపర్కం ఉంటే అంతగా ఆ భాష ప్రపంచ భాషలో అభివృద్ధి చెందినదని భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం. దీనికి ప్రపంచంలో బహుళ ప్రచారం పొందిన ఆంగ్లభాషను ఉదాహరణగా పేర్కొనవచ్చు.

ఒక జాతి వేరొక జాతిపై రాజకీయంగా, సాంస్కృతికంగా, సాంఘికంగా, మతపరంగా, ప్రభావం కలిగివస్తే ఒక భాషపై మరో భాష ప్రభావం కనబడుతుంది. బ్రిటీషు పరిపాలనా కాలంలో తెలుగు సాహిత్యంలో ఇంగ్లీషు పదాలు కోకొల్లలుగా చేరాయి. అదేవిధంగా మహమ్మదీయుల పరిపాలనా కాలంలో ఉర్దూ, అరబిక్, పర్షియన్ మొదలగు భాషాపదాలు విరివిగ చోటు చేసుకున్నాయి.

తెలుగు సాహిత్యంలో ప్రతి రచయిత రచనల్లోనూ, అన్య దేశ్యాలు కనబడుచున్నాయి. అలాగే అడివి బాపిరాజు సాహిత్యంలో కూడా అన్యదేశ్య పదాలు చోటు చేసుకున్నాయి. ప్రస్తుతం బాపిరాజు కథా సాహిత్యంలో కన్పించే ఉర్దూ, మరాఠీ, అరబ్బీ, హిందీ, పారశీకం మున్నగు భాషల అన్యదేశ్య పదాల్ని గూర్చి నిశితంగా పరిశీలించడమే ఈ వ్యాసం ముఖ్యోద్దేశం.

1. అరబ్బీ :

రూ. అరబీ, అరబి, అరబ్బా, అరబ్బు, హరబ్బు. అరబ్బీ భాష. "పసుబాలుడికి పారశీకం అరబ్బీ మహారాష్ట్రి భాషలు నేర్చుకుందామని తోచింది" (అంజలి, పు.88) కాశ్మీరి-అరబీ, నేపాలి-అరబ్, ఒరియా-అరబ్, అరబీ, హిందీ-అరబ్, గుజరాతి-అరబీ, అరబ్బి, మరాఠీ-అరబీ, ఉర్దూ-అరబీ, పారశీకం-అరబ్, కనడం-అరబి, అరబ్బి, తుళు-అరబి, తమిళం-అరపి, అఱపి, మలయాళం-అఱపి.

ఉర్దూ-అరబ్.

2. అర్జీ :

మనవి, పత్రం, వ్రాతపూర్వకమైంది. "కలెక్టరు తెల్ల దొర ఆ కోనేట్లో స్నానం చేస్తానంటే ఊరువారంతా పనికిరాదని అర్జీలు చేసుకున్నారు. (కొండపైన కోవెల కొండ క్రింద కొలను, అముద్రిత కథ). హిందీ - అర్జ్, గుజరాతి-అరజ, అరజీ, మరాఠీ-అర్జ; అర్జీ, ఉర్దూ, అరబీ, పారశీకం-అర్జీ.

ఉర్దూ-అర్జీ.

3. అసలు :

రూ. అస్సలు, మొదటిది, నిజం. "అసలు ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు...." (వింధ్యాచలం, పు. 114). నేపాలి, మరాఠీ-అసల్, అస్సల్, హిందీ, అరబ్బీ-అసల్, గుజరాతి-అసల్, అస్లీ, ఉర్దూ-అసల్, అస్ల, కనడం-అసల్, తుళు-అసలు, తమిళం-అచల్, బ్రాహుయీ-అసల్, అస్లీ.

ఉర్దూ-అస్ల.

4. ఆఖరు :

రూ. ఆకరు, ఆకరువు, ఆకరి, ఆకిరు, ఆఖయిరు, అఖిరు, ఆఖేరు, అహరు, చివరిది, చివర, అంత్యం. "వైద్య కళాశాలలో వైకుంఠరావు ఆఖరు సంవత్సరం చదువుతూ ఉండగా....(అంజలి, పు. 56). నేపాలి-ఆఖిర్, ఆఖరి, అఖిరి, ఆఖరి, హిందీ-ఆఖిర్,

అఖిరి, మరాఠీ-ఆఖర, పారశీకం-ఆఖిర్, ఉర్దూ-అఖిర్, ఆఖ్రిర్, అరబ్బీ-ఆఖిర్, అఖ్రిర్, కనడం-అఖరు, అఖైరు, తుళు-అకేరి, బ్రాహుయీ-ఆఖిర్, ఆఖిరి.

ఉర్దూ-ఆఖిర్.

5. ఇనాము :

రూ. ఇనామ్, ఈనాం, ఈనాము. బహుమానం, మాన్యం, ప్రతిఫలం, చేసిన సేవలకు మెచ్చి యిచ్చేది బహుమతి. "ఒక ఎకరం ఇనాము యిచ్చారు" (భోగీరలోయ, పు. 50). నేపాలి-ఇన్ఆమ్, హిందీ-ఇనామ్, గుజరాతీ, మరాఠీ-ఇనామ్, ఉర్దూ-ఇన్ఆమ్, పారశీకం-ఇన్ ఆమ్, అరబ్బీ-ఇన+ఆమ్, ముండ-ఇలామ్, కనడం-ఇనాము, ఇనామ, తుళు, తమిళం, మలయాళం-ఇనామ్, కోట-ఇనమ్, బ్రాహుయీ-ఇనామ్.

ఉర్దూ-ఇన్ఆమ్.

6. కత్తి :

ఆయుధం, చాకు, మంగలికత్తి, కోతపనిముట్టు, చెక్కే-ఇనుప పనిముట్టు. "తండ్రిగారి మోస్తరుగా కత్తికటారులు తిప్ప డంలో చాకచక్యం ఎక్కడా కనబడలేదు అతని దగ్గర"(అంజలి, పు. 85). సంస్కృతం-కర్తృకా, కర్త్రికా, ప్రాకృతం-కత్తియా, హిందీ-కత్తీ, సింధీ-కాతీ, మరాఠీ-కత్తి, కనడం-కత్తి, కొద, తుళు, తమిళం-కత్తి, కోత-కత్య్, తొద-కఢ్ కొత్య్. గోండి-కాతి, పర్జి-కత్, కోయి-బల్లా-కత్, బ్రాహుయీ-కత్తర్, కత్తి.

ప్రాకృతం-కత్తియా.

7. కబురు :

రూ. ఖబటు, ఖబురు. వృత్తాంతం, కొత్త సంగతులు, సమాచారం, వార్త. "వారందరు కొంచెంసేపు ఆ కబుర్లు ఈ కబుర్లు చెప్పుకొని...." (అంజలి, పు. 42) హిందీ, ఉర్దూ-ఖబర్.

ఉర్దూ-ఖబర్.

రూ. కాకితం, కాగిణం. కాగతం, కాగదం, కాగితం, కాగిదం, కాయితం. వ్రాయడానికి ఉపయోగించే పత్రవిశేషం. "ఒక స్త్రీ మేలిముసుగు వేసుకువచ్చి ఒక కాగిప్ముక్క ఆ పరదాడుకు ఇచ్చింది" (అంజలి, పు. 107). హిందీ, ఉర్దూ-కాగజ్, మరాఠీ-కాగద్, పారశీకం-కాఘజ్, కాఘజ్.

ఉర్దూ-కాగజ్.

9. ఖాళీ :

రూ. కాలీ, ఖాలి, ఖాళి, ఖాళీ. ఉత్తది. శూన్యం. "ఏ సెకండు క్లాసులోనూ ఖాళీలేదు" (అంజలి, పు. 63). హిందీ, మరాఠీ, ఉర్దూ, అస్సామీ, పారశీకం, అరబ్బీ-ఖాలీ.

ఉర్దూ-ఖాలీ.

10. కుర్చీ :

రూ. కురిచీ, కురుచీ, కుర్చి, కుర్చీ. కూర్చోడానికి ఉపయోగించే ఉన్నతపీఠం. "అహమ్మదాబాదు కాంగ్రెస్‌లో కుర్చీలూ, బల్లలూ లేవు" (అంజలి, పు. 55). హిందీ, ఉర్దూ-కుర్సీ, కనడం-కురిచి, కురచి, కురువి, కుర్చి, తుళు-కుర్చి, కుర్చి, తమిళం-కురిచ్చి, కురుచ్చి, కూర్చి, మలయాళం-కుజువి, పర్జి-కుర్చి, కుర్జి, బ్రాహుయీ-కుర్చీ, కువి-కూర్చి.

ఉర్దూ-కుర్సీ.

11. కౌలు :

రూ. కవులు, కౌవులు. ప్రభుత్వం ప్రజలకు భూమిని గూర్చి ఇచ్చే ఒడంబడిక. "రతీవరు సీలాలుకే భూమి కౌలుకిచ్చి చక్కాపోయాడు" (రాగమాలిక, పు. 32). హిందీ, ఉర్దూ-కౌల్, కనడం-కవులు, కౌలు, తమిళం-కౌవుల్.

ఉర్దూ-కౌల్.

12. ఖరీదు :

వెల, విలువ. "వంటలకు ఖరీదులు ఎచ్చి ఇప్పుడు పదిహేను వందలు వస్తున్నాయి" (తరంగిణి, పు. 100). హిందీ, ఉర్దూ-ఖరీద్, మరాఠీ-ఖరీదీ, ఖరేదే, పారశీకం-ఖరీద్, ఖరిదన్, కనడం-ఖరీది.

ఉర్దూ-ఖరీద్.

13. ఖర్చు :

రూ కర్చు, కరుచు, ఖరుచు, వ్యయం, వెచ్చం. "తోటలో వచ్చిన రాబడులవల్ల పైఖర్చులూ కొడవ జీతాలూ వస్తున్నవి" (తరంగిణి, పు 38). హిందీ, ఉర్దూ-ఖర్చ్, మరాఠీ-ఖర్చ్, ఖర్చణే, పారశీకం-ఖర్చ్, అరబ్బీ-ఖర్చ్, ఖర్చీ, కనడం-ఖర్చు.

ఉర్దూ-ఖర్చ్.

14. ఖామందు :

రూ. ఖావందు, ఖోదావందు, ఖావిందు. యజమాని, ప్రభువు, స్వామి. "అవునండి ఖామందుగారూ!" (భోగీరలోయ,

"పోయిందే!"




మేలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు

తలనొప్పులను, పొట్ట నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా ఉపశమింపజేయగలదు!

# మేలుపరచబడిన
# అమృతాంజన్

Amrutanjan Limited 

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా తిరిగి వికసింపజేయగలదు!

పు. 39). హిందీ-ఖావింద్, మరాఠీ, ఉర్దూ-ఖావంద్, ఖావింద్, పారశీకం-ఖావంద్, కనడం-ఖావంద్.

ఉర్దూ-ఖావంద్

15. ఖైదు :

రూ. ఖైదు, ఖయిదు, చెర, కారాగృహం. "నాగన్నను అరెస్టు చేసి తీసుకుపోయి తాలూకా గ్రామంలో ఖైదు చేశారు పోలీసువారు" (రాగమాలిక. పు 32). హిందీ, ఉర్దూ, మరాఠీ, అరబ్బీ, పారశీకం-ఖైద్, కనడం-ఖైదు.

ఉర్దూ-ఖైద్.

16. గల్లీ :

రూ గల్లి, సందు. "హైదరాబాదు సిమెంటు రోడ్లు హైదరాబాదు గల్లీలు .." (తరంగిణి, పు 104). కాశ్మీరి-గొలు, గల్లె, నేపాలి-గల్లి, బెంగాలి-గలి, ఒరియా-సందు, హిందీ, గుజరాతి, పంజాబి, ఉర్దూ, సింధి-గలీ, కనడం-గలి, మలయాళం-గల్లీ.

ఉర్దూ-గలి

17 గుమస్తా :

రూ. గుమాస్తా. క్రింది ఉద్యోగస్థుడు. "తాలూకాఫీసులో గుమస్తా ఉద్యోగానికి..." (తరంగిణి, పు 91) హిందీ, ఉర్దూ, పారశీకం-గుమస్తా.

ఉర్దూ-గుమస్తా.

18 చాకిరీ :

రూ చాకిరీ, సేవ, పరిచారకుడు, కొలువు, పరిచర్య. "నువ్వు నాకు ఆ కరకాలుగా చాకిరీ చేస్తావు" (తూలికానృత్యం, పు 25) హిందీ, ఉర్దూ-చాకరీ, మరాఠి-చాకరీ, పారశీకం-చాకరీ

ఉర్దూ-చాకరీ.

19. జమ :

రూ. జమా, జమ. రాబడి, మొత్తం, జమచేసుకొను, చేర్చడం. "అలాంటివాళ్ళలోనే నన్ను జమచేర్చావు" (తూలికానృత్యం, పు. 31). హిందీ, మరాఠి-జమా, ఉర్దూ-జమా, పారశీకం-జమఅ, అరబ్బీ-జమఅ.

ఉర్దూ-జమా

20. జమీ :

రూ. జమీను, భూమి, నేల, పొలం. "ఆ జమీ అంతా ఆరడే మన్నుకాను" (భోగిరలోయ, పు. 33). హిందీ, మరాఠీ, పారశీకం-జమీన్, ఉర్దూ-జమీన్.

ఉర్దూ-జమీన్.

21. జమిందారు :

రూ. జమీందారు, జమీద్దారు, జమీనుదారు, జమీందారుడు, జమీన్‌దారు. రాజుకు పన్ను కట్టే అధికారి, భూస్వామి, మొగలు సామ్రాజ్య కాలంలో భారతవర్షంన పన్నులు వసూలు చేయడానికి ఏర్పరిన ఉద్యోగి. "జమీందార్లు, జాగీర్దార్లు హరించి పడమటి గాలిలో మాయమైపోయారు" (భోగిరలోయ, పు. 36). హిందీ, మరాఠీ, ఉర్దూ-జమీన్‌దార్, పారశీకం-జమీదార్, జమీన్‌దార్.

ఉర్దూ-జమీన్‌దార్.

22. జవాను :

రూ. జమాను, జెవాను, సేవకుడు, రాజకీయ ఉద్యోగి, బంట్రోతు. "ఒక పోలీసు జవాను ఏయ్! ఎంతసేపు నిలు చూస్తావు..." (కర్ణబిలం, కృష్ణాపత్రిక జూన్-25, 1949) హిందీ, ఉర్దూ, మరాఠీ, పారశీకం-జవాన్.

ఉర్దూ-జవాన్

23 జవాబు :

రూ జాబు. ఉత్తరం, సమాధానం, ప్రత్యుత్తరం. "ఏదో జవాబు చెప్పకపోతే నేను వొట్టి మూర్ఖుణ్ణౌతాను" (తరంగిణి. పు. 48). హిందీ, మరాఠి, ఉర్దూ. పారశీకం, అరబ్బీ-జవాబ్.

ఉర్దూ-జవాబ్

24. జాగిర్దారు

రూ. జాగీరుదారు, జాహీరుదారు. సర్కారువారిచే ఇవ్వబడిన భూమికి యజమానుడు, నవాబుల నుండి కొంత భూమిని పొందినవాడు, జాగీరు కలవాడు. "జాగీర్దార్లు హరించి పడమటి గాలిలో మాయమైపోతారు" (భోగిరలోయ, పు. 36). హిందీ, ఉర్దూ-జాగీర్‌దార, పారశీకం-జాగీర్‌దార, కనడం-జహగీరుదార, జగీరుదార, జాగీరుకు.

ఉర్దూ-జాగీర్‌దార్.

25. జాగీరు :

రూ. జహగీరు, జాగరు, జాగిరు. నవాబులు యోధుల కిచ్చిన మాన్యం. చేసిన సహాయానికి ప్రభుత్వమిచ్చిన గ్రామాలు. భూములు, పన్ను విధింపబడని గ్రామదానం. ప్రభువు పన్నా పంగా ఇచ్చిన భూమి. "ఆమెకు శ్రీ సార్వభౌములు సూరద పాలెం జాగీరు ప్రక్కనున్న..." (అంజలి, పు. 132). హిందీ, పంజాబి, ఉర్దూ, పారశీకం-జాగీర్, కనడం-జహగీరు, జాగీర్, తమిళం-జాగీర్.

ఉర్దూ-జాగీర్.

26. జారీ :

ఆజ్ఞ, విడుదల. "మీమీద ఒక వారంటు జారీ అయిం దంది" (వింధ్యాచలం, పు. 58). హిందీ, ఉర్దూ-జారీ.

ఉర్దూ-జారీ.

27. జిల్లా :

మండలం. దేశంలో ఒక పరిమిత భాగం, ఒక ప్రాంతం, ప్రదేశం. "జిల్లా వైద్యాధికారి డాక్టర్ పి. పి. రావుగారు...." (తరంగిణి, పు. 103). హిందీ-జిలా, మరాఠీ-జిల్హా, ఉర్దూ, అరబ్బీ-జిల్అ.

ఉర్దూ-జిల్ అ.

28. జేబు :

రూ. జోబీ. చొక్కాలో కుట్టిఉండే చిన్న సంచి. "ఇంటికి పోయి జేబులో నుండి తన చెక్కు బుక్కు తీశాడు" (ఆంధ్ర భీంమవు, జూన్, మే. 14, 1944). ఉర్దూ, హిందీ-జేబ్, పారశీకం-జేబ్, జేబు, అరబ్బీ-జేబ్, జేబు

ఉర్దూ-జేబ్.

29. తనఖా :

రూ. తన్‌ఖాహ్, తాకట్టు, దస్తపత్రం. "భూములు తనఖా పెట్టి...." (రాగమాలిక, పు. 90). హిందీ-తన్‌ఖాహ్, తన్ ఖ్వాహ్, మరాఠీ-తనఖా, ఉర్దూ-తన్‌ఖ్వాహ్, పారశీకం-తన్‌ఖ్వాహ్.

మరాఠీ-తనఖా.

30. తనిఖీ :

తనఖీ, తనికీ, తనిఖీ, విచారం, పరిశీలనం, సోదా చేయటం. "మిమ్మల్ని తనిఖీ చేయడానికి వచ్చిన...."(అంజలి, పు. 100). హిందీ, ఉర్దూ, పారశీకం, అరబ్బీ-తన్‌కీహ్.

ఉర్దూ-తన్‌కీహ్.

31. తాకీదు :

రూ. తహకీదు, తాకదు, తాకిదు, తాకీదు, తాక్కీదు, తాక్కీదు, తాఖీదు, తాహదు, తాహందు, ఆజ్ఞాపత్రం, హుకుం. "....విజ్ఞాపనలు తాకీదులు" (కోగిరలోయ, పు. 57). హిందీ, ఉర్దూ-తాకీదు, మరాఠీ, పారశీకం, అరబ్బీ-తాకీద్.

ఉర్దూ-తాకీద్.

32. తాబేదారు :

రూ. తాబేదారుడు. తక్కువ పనివాడు, తన కింద సేవ కుడు, ఆధీనంలో వున్నవాడు. "ప్రజలు, సేవకులు, సేవాధికారులు తాబేదారులు యావన్మందిన్నీ సర్వ గౌరవాలతో వారికి నౌకరీ చేయవలసింది" (అంజలి, పు. 91). హిందీ, ఉర్దూ-తాబేదార్.

హిందీ-తాబేదార్.

33. తారీఖు :

రూ. తారిఖు, తేది. "చివరకాతరు 1947 ఏప్రిల్ నెల 5వ తారీఖున తన గురుపాదాలకతకు చేరుకున్నాడు" (తూలికా నృత్యం, పు. 11). హిందీ, మరాఠీ, ఉర్దూ, పారశీకం, అరబ్బీ-తారీఖ్.

ఉర్దూ-తారీఖ్.

34. తాలూకా :

రూ. తాలూకు, తాలుకు, తాలూక్, తాలూకా, తాలూకె, తాలూకే, తాలుక్క, తాల్లూకా, జిల్లాలో ఒక భాగం. "తాలూకాఫీ సులో గుమస్తా ఉద్యోగానికి...." (తరంగిణి, పు. 91). హిందీ-తాల్లుక్, తఅల్లుక్, మరాఠీ-తాలుకా, ఉర్దూ-తఅల్లుక్, పారశీకం-తఅల్లుక్, అరబ్బీ-తఅల్లుక్.

ఉర్దూ-తిఅల్లుక్.

35. తివాసీ :

రూ. తివాచి, తివాచీ, తివాశీ, తివాస, తివ్వాసి. ఉన్ని దారంతో చిత్తుగా నేసిన కంబళి, మేలైన చిత్రాసనం. "అచట కులపతి హాలులో తివాసీపై కూలబడి ఉండటమూ...." (తూలికా నృత్యం, పు. 26). మరాఠీ, ఉర్దూ, పారశీకం-తివాసీ.

ఉర్దూ-తివాసీ.

36. దరఖాస్తు :

రూ. దరకాస్తు, దర్ఖాస్తు, నివేదన పత్రం, విన్నపం. "ఏమి పుట్టిందో తల్లికి చెప్పకుండా పైన్యాధికారోద్యోగానికి

దరఖాస్తు పెట్టినాడు" (అంజలి, పు. 80). హిందీ, మరాఠీ-దర్‌ఖాస్త్, ఉర్దూ, పారశీకం-దర్‌ఖ్వాస్త్, అరబ్బీ-దర్‌ఖాస్త్.

ఉర్దూ-దర్‌ఖ్వాస్త్.

37. దర్జా :

హోదాయి, గొప్పదనం, హోదా, స్థితి, మెట్టు. "ఏమి దర్జారా, మనకేసి నవ్వుతూ చూసినట్లుగా అయిందిరా" (అంజలి, పు. 59). బెంగాలీ, ఒరియా, హిందీ, ఉర్దూ-దర్జా.

ఉర్దూ-దర్జా.

38. దివాను :

రూ. దివాన్, దివానీ, దివానుడు. రాజోద్యోగి, మంత్రి, వజీరు, ప్రధానుడు. "రాజ్యం దివాను నా చెరుక" (రాగమాలిక, పు. 92). హిందీ, ఉర్దూ, పారశీకం-దీవాన్, మరాఠీ-దివాణ, అరబ్బీ-దైవాన్.

ఉర్దూ-దీవాన్.

39. దుకాణం :

రూ. దుకణం, దుకనం, దుకానం, అంగడి, వస్తు విక్రయశాల, కొట్టు. "సారా దుకాణాలు నాను దుకాణాలు" (తరంగిణి, పు. 104). హిందీ, ఉర్దూ-దూకాన్, మరాఠీ-దుకాణ, దుకాన, పారశీకం-దుకాన, దుక్కాన్, అరబ్బీ-దుక్కాన్, కనడం-దుకాను, తుళు-దుకాను.

మరాఠీ-దుకాణ.

40. దుబాసీ :

రూ. తుపాసి, దుబాసి, దుబాసీ. రెండు భాషలు వచ్చిన వాడు, ఒక భాషను మరొక భాషలోకి మార్చే ఉద్యోగి. "కలెక్టరు స్టీవెన్సు దొరగారికి వాళ్ళమధ్య దుబాసీ అయినాడు" (కొండపైన కోవెల, కొండ కింద కొలను, అముద్రిత కథ). సంస్కృతం-ద్విభాషీ, హిందీ, ఉర్దూ-దుబాసీ, తమిళం-తుపాసి.

ఉర్దూ-దుబాసీ.

41. నవాబ్ :

రూ. నవాబు, నవ్వాబు, నహాబు, నేబాబు. రాజు, ప్రభువు, ముస్లింల బిరుదు, చక్రవర్తి. "అందు చివర నావాబ్ ముద్ర ఉన్నది" (అంజలి, పు. 92). హిందీ-నావాబ్, మరాఠీ-నవాబ్, ఉర్దూ-నవాబ్, నవ్వాబ్, పారశీకం-నవ్వాబ్, నొవాబ్, అరబ్బీ-నవ్వాబ్.

ఉర్దూ-నవాబ్.

42. నాజూకు :

రూ. నాజుకు, సున్నితమైన, నాణ్యమైన, సోకైన, కోమలమైన, అందమైన, మృదువైన, సుకుమారమైన. "ఆ అమ్మాయి నాజూకుగా పొడుగుగా...." (వింధ్యాచలం, పు. 46). హిందీ-నాజూక్, మరాఠీ, ఉర్దూ-నాజూక్, పారశీకం-నాజుక్, అరబ్బీ-నాజిక్.

ఉర్దూ-నాజూక్.

43. నిఖారసు :

రూ. నికార్సు, నికాలసు, నికాలస్తు, నిజమైన, స్వచ్ఛమైన. "కాశ్మీరములోంచి వచ్చిన నిఖారసైన ఆర్య బ్రాహ్మణుడు" (వింధ్యాచలం, పు. 2) హిందీ, ఉర్దూ-నిఖారిస్.

ఉర్దూ-నిఖారిస్.

44. నౌఖరీ :

రూ. నౌకరి, నవుకరి, సేవ, ఉద్యోగం, పరిచర్య. "....గౌరవాలతో వారికి నౌఖరీ చేయవలసింది" (అంజలి, పు. 92). హిందీ, ఉర్దూ-నౌకరీ, పారశీకం-నౌకరీ.

ఉర్దూ-నౌకరీ.

45. పాదుషా :

రూ. పాదశా, పహదషా, పాదా, పాద్చా, పాద్చాయీ, పాఛా, పాచ్చా, పాద్చాయి, పాద్చావు, పాదశాహ, పాదహ, పాదసహా, పాదసాహ, పాదిషా, పాదుశా, పాదుశావా, పాదుశాహి, పాదుశాహు, పాదుష, పాదుషహ, పాదుషహా, పాదుషా, పాదుషాయి, పాదుషాహా, పాదుషాహి, పాదుషాహు, పాదుసహ, పాదుసహా, పాదుసా, పాదుసాహి, పాశ్చాపాశ్చావు, బాదశహ, బాదషహ, బాదషహా, బాదసహ, బాదశాహ, బాదుశా, బాదుషా, రాజు, సమ్రాట్టు, ముస్లిం చక్రవర్తి. "ఇది పాదుషా ఆజ్ఞ". (అంజలి, పు. 92) హిందీ-పాద్‌శాహ్, బాద్‌శాహ్, ఉర్దూ-పాద్‌శాహ్, బాద్‌సాహ్, పారశీకం-పాద్‌షాహ్, బాద్‌షాహ్, కనడం-పాద్చ, పాతషాహీ, పాతుషాల్, పాదషాహ, పాదుషాహ, తమిళం-పాద్చా, సాదుషా, పాట్చా.

ఉర్దూ-పాద్‌శాహ్.

46. పారశీక :

రూ. పారసి, పారశీ, పారశీ, పారషి, పారషీ, ఫారషి, ఫారషీ, ఫారసి, ఫార్షీ, భారషి. ఇరానియన్ భాషా కుటుంబానికి చెంది పారశీక దేశంలో ప్రచుర వ్యవహారం గల భాష. "వసుబాలుడికి పారశీకం అరబ్బీ మహారాష్ట్రి భాషలు నేర్పు

కుందామని తోచింది" (అంజలి, పు. 88). సంస్కృతం-పారసీక, హిందీ-పారసీ, మరాఠీ-పారశీ, ఫారశీ, పారసీ, ఉర్దూ, పారశీకం-పార్సీ.

· ఉర్దూ-పార్సీ.

47. పూరి :

భక్ష్య విశేషం, తినుబండారం. "ఉదయం అక్కడ ఇన్ని పూరీలు తిని పాలు తాగి బస్సుమీద ఆబూ చేరారు" (అంజలి, పు. 59). సంస్కృతం-పూరికా, హిందీ, ఉర్దూ-పూరీ, కనడం, తమిళం-పూరి.

హిందీ-పూరీ.

48. ఫిరంగులు :

రూ. ఫిరంగి, ఫిరంగికా, పిరంగీ, పిరంగి, పేరంగి, ఫిరంగు. లోపల మందుగుండు వేసి దట్టించి కూర్చే పెద్ద లోహపు క్రోవి. "లోకం అంతా ఫిరంగులు మోగిపోతున్నట్లే అయింది" (అంజలి, పు. 90). హిందీ, ఉర్దూ-ఫిరంగీ, మరాఠీ-ఫిరంగీ, పిరంగి, పారశీకం-ఫిరంగీ, ఫిరంగ్, కనడం-ఫిరంగి.

ఉర్దూ-ఫిరంగీ.

49. బంగళా :

రూ. బంగల, బంగాళా, బంగ్లు, బంగ్లా. బాటసారులు లేదా పెద్ద పెద్ద ఉద్యోగస్థులు దిగేందుకు కట్టిన పెద్ద భవనం, పెద్దఇల్లు, అతిథి గృహం. "అందమైన కారు, జిల్లా వైద్యాధికారి బంగాళా, ఇంగ్లీషుకబ్బు అనుకున్నవి జరుగుచున్నాయి." (తరంగిణి, పు. 98). హిందీ, ఉర్దూ-బంగ్‌లా, గుజరాతి-బంగలో, మరాఠీ-బంగళా.

ఉర్దూ-బంగ్‌లా.

50. బగ్గి :

రూ. భగ్గు. గుర్రపుబండి, నాలుగు చక్రాల గుర్రపుబండి. "ఏమయ్యా బగ్గీవాలా శ్రీపాదుషావారికి ఎన్ని అరబ్బీ గుర్రాలున్నాయి" (అంజలి, పు. 90). హిందీ-బగ్గీ, బగ్ఘీ.

హిందీ-బగ్గీ.

51. బజారు :

రూ. బాజారు, బజాలు, బాజారీ, బాజాలు. అంగడి వీధి, సంత. "తాను గడ్డికోసి బజారులో అట్టావాళ్ళ కమ్మితే..." (తరంగిణి, పు. 90). హిందీ, ఉర్దూ, పారశీకం-బాజార్, మరాఠీ-బాజార్, బాయూర్.

ఉర్దూ-బాజార్.

52. బంట్రోతు :

రూ. బంట్రవతు, బంట్రపుతు. సేవకుడు, నౌకరి. "పుస్తకాలు పట్టుగా అన్నీ వారి బంట్రోతు సేతూరాం పట్టుకు వస్తాడు" (వింధ్యాచలం, పు. 60). ఒరియా-బాంట, హిందీ-ఉర్దూ-బంట్రౌత్, గుజరాతి-వాంటోరాఉత్, మరాఠీ-వాంటా-రాఉత.

ఉర్దూ-బంట్రౌత్.

53. బదిలీ :

రూ. బదలి, బదలీ, బదిరి. "ఉద్యోగుల్ని ఒకచోట నుంచి ఇంకోచోటికి మార్చడం, మార్పు, ప్రత్యామ్నాయం. "ఎన్ని తాలూకాలో బదిలీ...." (తరంగిణి, పు. 100). హిందీ, ఉర్దూ-బద్‌లీ, కనడం-బదిలి, తమిళం-పతల్, తపతిల్, పతిలి.

ఉర్దూ-బద్‌లీ.

54. బస్తాలు :

గోనె, సంచి, మూట, కట్ట. "పది బస్తాలు తనకు సహాయం చేసే...." (తరంగిణి, పు. 38). హిందీ, ఉర్దూ-బస్తా, పారశీకం-బస్తహ్.

ఉర్దూ-బస్తా.

55. బాకీ :

రూ. బాకి, బాకి, బాక్కి. అప్పు, ఋణం. "తండ్రి బాకీ దారుడై ..." (అంజలి, పు. 34). హిందీ, మరాఠీ, ఉర్దూ, పారశీకం-బాకీ, కనడం-బాకీ, తమిళం-పాక్కి, మలయాళం-బాక్కి.

ఉర్దూ-బాకీ.

56. బురఖా :

రూ. బురుకు, బుర్కా, ముసుగు, ఆచ్ఛాదనం. వదులుగా వుండి ముస్లిమ్ స్త్రీలు ధరించే ఒక రకం ఉడుపు. "కాంగ్రెస్ బురఖా తగిలించుకొన్న దొంగలు" (వింధ్యాచలం, పు. 98) హిందీ-బుర్‌కా, మరాఠీ-బుర్‌కా, బుర్‌ఖా, ఉర్దూ-బుర్‌కా, పారశీకం-బుర్‌కా, అరబ్బీ-బుర్‌కా, తమిళం-పురుక్కు.

ఉర్దూ-బుర్‌కా.

57. బేజారు :

విముఖం, అప్రసన్నం. "ఈ ఆంబోతు ఏమిటా అని ఒక ముహూర్తం బేజారు అయిపోయినాడన్నమాచే" (కర్ణబిలం, కృష్ణాపత్రిక, జూన్-25, 1949). ఉర్దూ-బేజార్, పారశీకం-బీజార్.

ఉర్దూ-బేజార్.

58. మకాం :

రూ. మకాము, ముఖాము, మొకాం, మొకాము, మొక్కాము మొఖాం, మోకాం, నివాసం. ప్రయాణంలో నిలిచే స్థలం, ఆగేచోటు. "పొలంలోనే మకాం పెట్టాడు" (అంజలి, పు. 35). హిందీ-ముకామ్, మరాఠీ-ముక్కామ్, ముకామ్, ఉర్దూ-ముకామ్, పారశీకం-ముకామ్. మకామ్, అరబ్బీ-ముకామ్.

ఉర్దూ-ముకామ్.

59 మజిలి :

రూ. మజిలి, మజిలీ. తాత్కాలిక స్థానం, ప్రయాణంలో ఆగేచోటు, బస, సత్రం. 'వదిలిన మజిలీకే మళ్ళీ చేరుతావా?' (తరంగిణి, పు. 87). హిందీ-మంజిల్, మరాఠీ-మజలా, ఉర్దూ-మంజిల్, పారశీకం-మంజిల్, కనడం-మజలు, తమిళం-మంజల్, మజిల్, మంచిల్.

ఉర్దూ-మంజిల్.

60. మలాం :

రూ. మలాము, మలామలాను, మొలాము. బంగారం లోనగువాని పూత. "మలాంచేసి జీనువేసి పంచి దుస్తులు...." (భోగీరలోయ, పు. 68). హిందీ-ములమ్మా, మరాఠీ-ములామా, ఉర్దూ, అరబ్బీ-ములమ్మా, పారశీకం-ములమ్మ, తమిళం-మలామ్.

ఉర్దూ-ములమ్మా

61. మసీదు :

రూ. మజీదు, మజ్జీతు, మశీద్, మసజీదు, మసీదు, మసీదు, మహజీద్, మహజీదు. మహమ్మదీయులు ప్రార్థన చేసే మందిరం. మహమ్మదీయులు నమాజులు చేసే చోటు. "తను కట్టుకున్న గుళ్ళని చర్చిలనీ, మసీదులనీ, పగోడాలనీ పేర్లు పెట్టుకున్నాడు" (కొండపైన కోవెల కొండ క్రింద కొలను, అముద్రిత కథ). హిందీ-మస్జిద్, మసిద్, మరాఠీ-మశీద, ఉర్దూ-మస్జిద్, పారశీకం-మస్జిద్, అరబ్బీ-మస్జిద్.

ఉర్దూ-మస్జిద్.

62. మహల్ :

భవనం, మేడ, హర్మ్యం. "దివానీమహల్ నుంచి తన విడిది మంజిల్‌కు వస్తుంటే...." (అంజలి, పు. 90). హిందీ, మరాఠీ, ఉర్దూ-మహల్, పారశీకం-మహల్, మహల్ల్, అరబ్బీ-మహల్ల్.

ఉర్దూ-మహల్.

63. మునసబు :

రూ. మునశీబు, మునసబ్, మునసపు, మునసవ్, మునసపు, మునసీప్, మునిషిబు, మునిసిపు, మునిసీప్, మునిసీపు, మున్సపు, మున్‌సిపు, మున్సిపు, మున్‌సీబు, గ్రామ మునసబు, గ్రామ న్యాయాధికారి. "నేను మునసబుగారి...." (అంజలి, పు. 45). హిందీ, ఉర్దూ, అరబ్బీ-మున్‌సిఫ్, కనడం-మునసపు, మునసీపు, తమిళం-మునసీపు, మునిసీప్పు, మలయాళం-మున్‌సిఫ్, మున్‌సిప్పు

ఉర్దూ-మున్‌సిఫ్.

64. రాజీ :

అంగీకారం, సంధి, సమ్మతి, ఇష్టం. "నెహ్రూగారు రాజీ చేసుకోండయ్యా అంటారు" (కొండపైన కోవెల కొండ క్రింద కొలను, అముద్రిత కథ). హిందీ, ఉర్దూ, మరాఠీ, పారశీకం-రాజీ.

ఉర్దూ-రాజీ.

65. రాజీనామా :

రూ. నాజీనామా, రాజినామా, పదవీ విరమణ, విరమించుకోవడం. "తాను చేయు అసిస్టెంటు సర్జను పనికి రాజీనామా ఇచ్చి...." (యుగముల నుండి నీకొరకు కనిపెట్టుకొని యుంటిని, ఆంధ్రపత్రిక, మార్చి-25, 1925). హిందీ, ఉర్దూ-రాజీనామా, పారశీకం-రాజినామహ్.

ఉర్దూ-రాజీనామా.

66. రావు :

పూర్వకాలంన వెలమదొరల పట్టపుపేరు, పేరుచివర చేర్చు గౌరవసూచకమగు పదం, ఠీవి. "....రావుకు కవబడుటలేదు" (అంజలి, పు. 79). సంస్కృతం-రాజన్, పారశీకం-రాయ్, మరాఠీ-రావో, రాఓ, ఉర్దూ-రాఓ, కనడం-రావు, తమిళం-రావ్.

మరాఠీ-రావో, రాఓ.

67. రోజు :

దినం. "ఒక రోజున బొంబాయి...." (రాగమాలిక, పు. 122). హిందీ, మరాఠీ, పారశీకం, ఉర్దూ-రోజ్.

ఉర్దూ-రోజ్.

68 లంగరు :

రూ లంగర. ఓడ నిలవడం కోసం అడుగున దిగవేసే నాగలిలాంటి ఇనుప సాధనం. "లంగరు ఎత్తలేదట" (తూలికా నృత్యం, పు. 78) హిందీ. ఉర్దూ-లంగిర్.

ఉర్దూ-లంగిర్.

69. లష్కరు :

రూ లస్కర్, లసికిరి, లశికిరి, లష్కర్. సైన్యం, సైనిక స్థావరం. "వారితో కూడా వచ్చే చిన్న లష్కరులో...." (అంజలి, పు. 104). పారశీకం-లష్కర్, మరాఠీ-లశ్కర్, హిందీ-లశ్కర్, ఉర్దూ-లషకర్, తమిళం-లష్కర్.

ఉర్దూ-లష్కర్.

70. వకీలు :

రూ. వక్కీల్, వక్కీలు, న్యాయవాది. "పెద్ద వకీలు ప్రజ్ఞావంతుడు అయిన వీరాస్వామి" (రాగమాలిక, పు. 30). హిందీ, ఉర్దూ, పారశీకం-వకీల్, అరబ్బీ-వకీల్, కనడం-వకీలు, తమిళం, మలయాళం-వక్కీల్.

ఉర్దూ-వకీల్.

71. వాకబు :

దర్యాప్తు, తనిఖీ, విచారణ. "అక్కడ వాకబు చేసి బందరు వెళ్ళారని తెలుసుకొని...." (కోగిరలోయ, పు. 72). హిందీ, ఉర్దూ-వాకిఫ్

ఉర్దూ-వాకిఫ్.

72. శాలువ :

రూ శల్లా, శాల్, శాలు, శాలువ, శాలువు, శాల్వ, సాలు, షాలువు, సాల్వు, సెల్ల, సేలు సన్నని వస్త్రం ఉత్తరీయంగా కప్పుకొను వస్త్రం, ఉత్తమ పట్టువస్త్రం "నూటయాభై రూపాయల శాలువనూ " (కోగిరలోయ, పు 50). మరాఠీ-శాలా, ఉర్దూ-శాల్, హిందీ-శాల్, పారశీకం-షాల్.

మరాఠీ-శాలా.

73. సరదార్ :

రూ. సరదారు, సరదారుడు, సర్దార్. అధికారులు. "తురక సర్దారులు కొందరు వచ్చి...." (అంజలి, పు. 91). హిందీ, మరాఠీ, ఉర్దూ, పారశీకం-సర్దార్.

ఉర్దూ-సర్దార్

74. సలామ్ :

రూ. సలాము, సల్లాము, వందనం. "వసుదాలువికి సలాం పెట్టి...." (అంజలి, పు. 89). ఉర్దూ, అరబ్బీ, పారశీకం, మరాఠీ, హిందీ-సలామ్.

ఉర్దూ-సలామ్

75. సుల్తాను :

రూ. సురతాణ, సురతాణి, సురతాన్, సురతాను, సురత్రాణ, సురత్రాణి, సురత్రాణుండు, సురధాణి, సురధాణు, సురదాణి, సురధాణ్, సురధాణ, సురదాని, సురధాన్ని, సులతాన్, సులతాను, సులుతాన పాదుషా, చక్రవర్తి. "మన యాత్రికులు సుల్తాన్‌గారి...." (అంజలి, పు 103). ఉర్దూ-సుల్తాన్, సుల్తాన్, అరబ్బీ, మరాఠీ, హిందీ, పారశీకం-సుల్తాన్.

ఉర్దూ-సుల్తాన్.

76. హాజరు

రూ. హాజేర, హాజిర్, వచ్చుట. "విరూపాక్షిన్న అతిరి టిక్కెట్టు కొని ఆ ప్రదర్శనానికి హాజరయ్యారు" (కర్ణబిలం, కృష్ణాపత్రిక, జూన్-25, 1949). మరాఠీ-హాజర, హాజరి, ఉర్దూ-పారశీకం, హిందీ-హాజిర్.

ఉర్దూ-హాజిర్.

77 హుక్కా :

పొగ పీల్చుటకు ఉపయోగించు గొట్టం. "ఒక రోజున హుక్కా పీలుస్తూ...." (అంజలి, పు. 88). ఉర్దూ-హుక్కా, అరబ్బీ-హుక్కాహ్, పారశీకం-హుక్క, హిందీ, మరాఠీ-హుక్కా.

ఉర్దూ-హుక్కా.

78. హుకుం ·

రూ. హుకుము, హుకుమీ, హుక్కుమ్ము. ఆజ్ఞ, శాసనం. "అరు బగ్గీలు నాలుగు ఒంటెలు ఒక ఏనుగు ఇరవై లష్కర్

హుంకుం" (అంజలి, పు. 92). ఉర్దూ-హుంకుమ్, అరబ్బీ, పారశీకం-హుక్మ్, మరాఠీ-హుకుమ్, హిందీ-హుకుమ్.

ఉర్దూ-హుంకుమ్.

## ఆధార గ్రంథాలు, వ్యాసాలు :

1) అన్యదేశ్యము : డాక్టర్ లకంసాని చక్రధరరావు, సాహితీ వాల్లభ్యము, ద్వితీయ భాగం, 1974.

2) ఆంధ్ర దేశ్యము-అన్యదేశ్యము : కోరాడ రామకృష్ణయ్య, భాషా చారిత్రిక వ్యాసములు, 1971.

3) ఆంధ్ర భావన సారస్వతమందలి ఉర్దూ, మరాఠీ పదములు:

డాక్టర్ లకంసాని చక్రధరరావు, అముద్రిత సిద్ధాంత గ్రంథం, 1965, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.

4) ఉర్దూ-ఇంగ్లీషు కోశం : రామ్ నారాయణ్ లాల్, అలహాబాదు, 1956.

5) తెలుగు, ఉర్దూ, పారశీకముల ప్రభావము : డాక్టర్ కె. గోపాలకృష్ణరావు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1968.

6) తెలుగు-ఉర్దూ భాషా సారస్వతముల తులనాత్మక అధ్యయనము ప్రాచీన యుగము : 'భారతీయ భాషల తులనాత్మక అధ్యయన సదస్సు' సెమినార్ 28, 29, 30, సెప్టెంబరు, 1986

7) తెలుగు, తమిళ భాషల్లోని ఉర్దూ పదాలు - తులనాత్మక పరిశీలన : డాక్టర్ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, అముద్రిత సిద్ధాంత గ్రంథం, 1985, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.

8) తెలుగున చేరిన యన్యదేశీయ శబ్దజాలము : ఆచార్య చిలుకూరి నారాయణరావు. ఆంధ్ర భాషాచరిత్ర, 1937.

9) తెలుగులో అన్యదేశ్యాలు : డాక్టర్ ఐ. స్వరాజ్యలక్ష్మి, తెలుగు భాషాచరిత్ర, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు-1979.

10) తెలుగు వ్యుత్పత్తి కోశం : ప్రధాన సంపాదకులు డాక్టర్ లకంసాని చక్రధరరావు, ఆంధ్ర విశ్వకళా పరిషత్, వాల్తేరు.

11) తెలుగు రచనలలో అన్యదేశ్యాలు : డాక్టర్ మోడేకుర్తి సత్యనారాయణ, భారతి, అక్టోబర్, 1959.

12) దక్షిణాంధ్ర వాఙ్మయంలో సవ్యభాషల ప్రవేశం : డాక్టర్ హేమలత, 1980.

13) భాషా చారిత్రక వ్యాసావళి : ఆచార్య తూమాటి దోణప్ప, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్-1972.

14) మన తెలుగులో తెలుగెంత?

| | | | | |
|---|---|---|---|---|
| అ. | ఈనాడు - | ఆదివారం | 17 ఏప్రిల్ | 1988. |
| ఆ. | ,, | ,, | 24 ఏప్రిల్ | ,, |
| ఇ | ,, | ,, | 1 మే | ,, |
| ఈ. | ,, | ,, | 8 మే | ,, |
| ఉ. | ,, | ,, | 15 మే | ,, |
| ఊ. | ,, | ,, | 22 మే | ,, |
| ఋ. | ,, | ,, | 29 మే | ,, |
| ౠ. | ,, | ,, | 5 జూన్ | ,, |

—డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ.

15) శబ్దరత్నాకరం : బి. సీతారామాచార్యులు.

16) పైదీ ఉర్దూ నిఘంటువు : సం. మౌలానా మహమ్మద్ మునీర్‌సా ఎడ్యుకేషనల్ ప్రెస్, కరాచీ.

17) ఎ కంపారిటివ్ అండ్ ఇటిమాలాజికల్ డిక్షనరీ ఆవ్ ది నేపాలీ లాంగ్వేజ్ : పాల్ఫ్ లిల్లీ టర్నర్, లండన్, బొరోడవే హవుస్-1931.

18) యాన్ ఇటిమాలాజికల్ గుజరాతి ఇంగ్లీష్ డిక్షనరి : ఆసియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్, న్యూఢిల్లీ.

# విద్యుత్ వ్యాహరణం

## శ్రీ గడియారం శేషఫణి శర్మ

సజల పర్జన్య
గర్జనా ఘోష మా భాష!
సహస్ర కిరణుని
సప్తాశ్వ హేష మా భాష!

అణీయోర్ధ్వ
వహ్ని శిఖా శిఖర
ప్రజ్వలత్ విద్రుమాక్షరాలు
మా అక్షరాలు!
విద్యుత్ బీజాక్షరాలు
మా అక్షరాలు!

అందుకే అంటున్నాను
మా విద్యుత్ శబ్దాల
వర్ణక్రమం వేరు!
వ్యాకరణమూ వేరు!!

విద్యుత్ శబ్దాల లింగాలు
త్రిలింగాల కతీతాలైన
విస్ఫులింగాలు!
తమః పటలాలను
పటాపంచలు చేసే
జ్యోతిర్లింగాలు!

విద్యుత్ శబ్దాల వచనాలు
ఏ వచనాలకూ అందని
తేజః ప్రవచనాలు!
నిస్తుల శేముషీ స్ఫురణకు
నిర్వచనాలు!

అందుకే అంటున్నాము
మా విద్యుత్ శబ్దాల
వర్ణక్రమం వేరు!
వ్యాకరణమూ వేరు!!

వెలది వెన్నెల కిరణాలు
మాకు వ్యాకరణాలు!
ఉషస్సుషమా
రహస్యాలు,
మాకు భాష్యాలు!

చలత్ యంత్ర
చటుల గాత్రాలు
మాకు సూత్రాలు.

పండి నిండిన
పసిడి కోరికలు
జ్యోత్స్నాంకురాల
పులకించిన చకోరికలు
మాకు కారికలు!

నిష్ఖందిత
జనతా నిర్వేదాలు,
తమోబంధ విచ్ఛేదాలు,
మా సంధి పరిచ్ఛేదాలు!

అందుకే అంటున్నాను
మా విద్యుత్ శబ్దాల
వర్ణక్రమం వేరు!
వ్యాకరణమూ వేరు!

ఘనతర చీకటి కోనల్లో
మణిదీపాలు పట్టే
జ్యోతిర్నిగమన ప్రక్రియలు
మా క్రియలు!

మూడు కాలాలకూ చిక్కని
చక్కని కాంతిగోళాలు
మా కాలాలు!

చీకటి పెనుఘాతాలను చీల్చి,
వర్తమాన కీర్తికెరటాలపై తేలి,
భవిష్య దవరోధాల
శపరికా హృదయాంతరాలలో
చిక్కుకోబోనున్న
పదునైన గాలాలు
మా కాలాలు!

విశ్వజన
శాశ్వత జీవహేతువులు
మా ధాతువులు!

ఉదయాస్తమయ శిఖరాల్ని
అనుసంధిస్తున్న
ఉజ్జ్వల కాంత సేతువులు
మా ధాతువులు!

అందుకే అంటున్నాను
మా విద్యుత్ శబ్దాల
వర్ణక్రమం వేరు!
వ్యాకరణమూ వేరు!!

నవనవోన్మేష
చైతన్య హేలా మధుమాసాలు
మా సమాసాలు!
నితాంత
కాంతికేళీ విలాసాలు
మా సమాసాలు!!

యంత్ర నిర్ముక్త
జలధారలతో
సస్య కేదారాలు పండితే
బహువ్రీహులు!

ఉరకలేస్తున్న శక్తితో
ఉక్కుముక్కలు కదిలితే,
చైతన్య నియామకాలు
రూపకాలు!

క్షణ క్షణం,
పతనాభ్యుత్థానాల మధ్య
సంతత కాంతి తరంగాలై
ప్రసరిస్తే,
సమాహార ద్వంద్వాలు!

అందుకే అంటున్నాను
మా విద్యుత్ శబ్దాల
వర్ణక్రమం వేరు!
వ్యాకరణమూ వేరు!!

శక్ర ధనుష్టంకారాలు
మా అలంకారాలు!
జ్యోతిరంగణ గణాహంకారాలు
మా అలంకారాలు!

శీతల కౌముదీకరణ
సమాశ్లేషలు
శ్లేషలు!

శ్లథాజర్జరిత
దీనహృదయ సముద్దీపకాలు
భావి భాగ్యోదయ
ప్రభా సందీపకాలు
దీపకాలు!

నీటినుండి
నిప్పునుండి
నిర్గమిస్తున్న మహాన్యాసాలు,
అర్థాంతరన్యాసాలు!

మలిసంజతో
ముగిసిన పగళ్ళని
మళ్లీ వెలుగులతో ముడివేస్తున్న
ముక్తపదగ్రస్తాలు!

అందుకే అంటున్నాను
మా విద్యుత్ శబ్దాల
వర్ణక్రమం వేరు!
వ్యాకరణమూ వేరు!!

గాఢాంధకార నిర్వారణ
కేళీ ప్రవణ
బంధుర జ్యోతిర్మయాంధస్సుల
మా ఛందస్సులు!

యంత్రశాస్త్ర
విద్యాగురువులు
మా గురువులు!

లఘువుల ప్రసక్తి లేని ,
[1]"విద్యున్మాలా" వృత్తాలు,
రాష్ట్రం నలు చెరగులా
వ్యాపించిన
మా విద్యున్మండలి[2] వృత్తాలు!!

అందుకే అంటున్నాను
మా విద్యుత్ శబ్దాల
వర్ణక్రమం వేరు
వ్యాకరణమూ వేరు!!

1) "ఉద్యన్మాగా యుక్తంబైనన్ విద్యున్మాలా వృత్తంబయ్యెన్" అని లక్షణము.

2) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యున్మండలిలోని "ఆపరేషన్ అండ్ మెయింటెనెన్స్ సర్కిల్స్"ను "వృత్తాలు"గా గ్రహించటం జరిగింది.

# మన్మథా!

చేతచివుళ్ల మేసి సడలించిన కంఠములెత్తు కోకిలల్,
చూతఫలమ్ములన్ మెసవి సొంపెసలారగ బల్కు చిల్కలున్,
నూతన తా తులీసుచు కనుంగొనదన్న వసంతలక్ష్మి మన్
యూరిటి నీకు స్వాగతము లిచ్చుచునున్నవి రమ్ము, మన్మథా!

చెఱకును నీవు విల్లుగను జేసి ధరింప, రతీలలామయున్
విరుల శరమ్ము లిచ్చుచును, వేడుక జూచుచు ప్రక్కనుండ, మీ
రిరువురు కీరవాహనము నెక్కి చరించుచు మా గృహమ్ములన్
పరిసరముల్ రసాన్విత మొనర్చుడు; ప్రేమరసైక జీవనుల్.

శ్రీ తెలిదేవర వెంకట బాలకృష్ణరావు



కన్నడ మూలం :
# కీ. శే. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

తెలుగు అనువాదం
# శ్రీ శంకరగంటి రంగాచార్యులు

# ఆధునికాంధ్ర సాహిత్యపు వేగము

ఈ దినము నేను ఆధునికాంధ్ర సాహిత్యపు సామాన్యమైన వేగమును గురించి నాలుగు మాటలు మాట్లాడెదను. కాన ఇచట వ్యక్తుల విమర్శ లేదు; ఉదాహరణములును ఉండవు.

ఆధునికాంధ్ర సాహిత్యమనిన సుమారొక శతాబ్దమున కీవల పుట్టిన సాహిత్యము మన దేశమునందున్న మిగిలిన అన్ని భాషలందు వలె తెనుగు భాషలో కూడ పాశ్చాత్యుల-ముఖ్యముగా ఆంగ్లేయుల - సాహిత్యమే ఇప్పటి సాహిత్యమునకు మార్గదర్శక మయినది. మన దేశపు రాజ్య, నీతి, మత, ఆచార - ఇత్యాదులలో యెట్లో అట్లే భాషా సాహిత్యములందును పాశ్చాత్యుల ముద్ర ప్రబలముగా ప్రత్యక్షమగుచున్నది. ప్రభువుల ప్రభావము ప్రజల అంగోపాంగములలోని ప్రతినాడిని వేధించుట ఆశ్చర్యమేమియును కాదు.

ఇంతవరకును మనల నేలుచుండినది ఆర్యభాషా సాహిత్యముల సంస్కృతి. వేలాది సంవత్సరములుగా, ఆసేతుశీతాచలము అక్షరాస్యులెవ్వరును ఆ సాహిత్యమును ఆ తయో ఇంతయో ఎరుగకుండుటకు వీలు లేకుండెను ఇప్పటి దేశభాష లన్నింటియందును, ప్రాతవైన ద్రావిడ భాషలను చూచినను, వానికి ఆర్య సాహిత్య భాషల సంబంధము లేని కాలము ఎప్పుడైనను ఉండినదా అని ఊహించుటకును వీలులేదు. కాని దీర్ఘకాల మొకచే ప్రభుత్వము పాలించుట ప్రభువులకు కానీ, ప్రజలకు కానీ సదా క్షేమకరము కాదు విధేయతతో వంగి వంగి ప్రజలు వెన్నెముక సారళ్యమును, దూరదృష్టిని పోగొట్టుకొందురు ప్రభువులు ఆజ్ఞలు చేసి చేసి శిక్షాస్మృతికి సంబంధించిన కొన్ని సూత్రములు తప్ప ప్రపంచయాత్రకు మరేవియు కావలెనని తెలిసికొని మొండివారగుదురు సంస్కృత సాహిత్యమున కిటువంటి జడత్వము దాపురించి సుమారు వేయేళ్ళకు పైబడినది దేశభాషలకు ప్రారంభదశలో కొంత స్వాతంత్ర్యము గల పోకడలును, పద్ధతులను ఉండినను, క్రమక్రమముగా సంస్కృత భాషా ప్రభుత్వ సూత్రముల బిగింపుచేత సర్కసు జంతువులవలె చెప్పినది మాత్రము చేయు విధేయత బలిసినది. సుమారేడెనిమిది శతాబ్దములుగా ఆంధ్ర సాహిత్యపు స్థితిగతులిట్లుండినవి. మహా ప్రతిభావంతులుండిరి: మహా పండితులుండిరి. కాని వారి ఉద్యోగము లన్నియును సూత్ర బంధనమునకు లోనై యుండెను. వారు మెరపిన దంతయు ఆ వలయము లోపలనే!

ఆంధ్రభాష యొక్క ఈ అవస్థలో 19వ శతాబ్దములో ప్రభుత్వము మారినది పాశ్చాత్య సాహిత్యపు విచిత్రములైన రూపురేఖలు మెఱుపులవలె మిరుమిట్లు గొలిపి, మోహపరచినవి. అప్పుడు కార్యశూరతలోను, ప్రతిభలోను అద్వితీయుడైన కందుకూరి వీరేశలింగం పంతులు ఆధునిక సాహిత్యమునకు పునాది వేసెను. పునాది మాత్రమే కాదు - పెద్ద కట్టడమునే కట్టెను. భాషా రచనలో ఆయన చేయి వేయని ప్రక్రియయే లేదు ఖండకావ్యము, మహాకావ్యము, నాటకము ప్రహసనము, కథ, నవల, వ్యాసము - మున్నగువానిలో ఆ కాలమున మన దేశమునకు దిగుమతియైన ఆంగ్ల సాహిత్యమున ఎన్ని ప్రక్రియలున్నవో, వాని నన్నింటిని ఆయన ఉపయోగించుకొనెను. అంతియే కాక మన ప్రాచీన సంప్రదాయములను కూడ తనకు తోచినట్లు ఎద్దేవా చేసి, విమర్శించి, నిందించి, యువకులలో ఒక నూతనోత్సాహమును కలిగించెను రసికదృష్టితో చూచిన ఆయన రచనలలో ఏదియును ఉత్తమశ్రేణికి చెందినది కాకున్నను, జనతలో ఒకవిధమగు విప్లవమును కలిగించి, వంచిన తలనెత్తి, నాలుగు దిక్కులకును చూచునట్లు ప్రేరేపించి, ఉపకరించినవి. తత్ఫలముగా ఆంగ్ల సాహిత్యము నధ్యయనము చేసిన తరుణ వయస్కులలో పలువురు, వారి ఉపదేశముచేత ఇతరులు కొందరు, భాషాచ్ఛందో భావరూపములలో ప్రాచీన సంప్రదాయములను ప్రతిఘటించి, క్రొత్త పుంతలలో సాహిత్య సృష్టి చేయ నారంభించిరి.

ఈ ఉద్యమపు ముఖ్య ఫలమొకటి· తెలుగు సాహిత్యమున ఉపయోగించుచున్న భాష ఇదివరకును అనేక శతాబ్దముల క్రితము వ్రాసిన వ్యాకరణపు కట్టడిని మీరియుండలేదు. ఇందుచేత వ్యవహార ప్రవాహపు భాషలో ఏర్పడిన మార్పులు బహుభాగము

శ్రీమతి మర్ల సుబ్బలక్ష్మి

# భారతంలో పెళ్ళికాని తల్లులు

నేటి సమాజంలో పెళ్ళికాని తల్లుల సమస్య ప్రపంచ వ్యాప్తంగా చాలా తీవ్రతరంగా వుంది. నేడే కాదు పురాణ కాలంలో కూడ ఈ సమస్య వుంది. హిందూమత పురాణాలలోనే కాక క్రైస్తవమతాధి దేవతయైన ఏసుక్రీస్తు తల్లి 'మరియ' కూడ కన్యగా తల్లియైనందుకు యెన్నో కష్టాలను ఎదుర్కొన వలసి వచ్చినట్లుగా క్రైస్తవమత గ్రంథాలవలన తెలుస్తోంది

పంచమ వేదంగా పేర్కొనబడుతున్న మహాభారతంలో కన్యలుగా మాతృత్వం పొందిన స్త్రీలు ఇద్దరు. ఒకరు సత్యవతి, రెండవవారు కుంతి. వీరిద్దరు కూడ కురువంశ వధువులు కావడం ఒక విశేషం. వీరిద్దరు కూడ కన్యలుగా తల్లులయినవారే అయినా వీరికి జన్మించిన పుత్రులకు సమాజంలో లభించిన స్థానాలలో మాత్రం చాలా వ్యత్యాసం వుంది. సత్యవతి పుత్రుడు గొప్ప ఋషియై వేదాలని సంస్కరించి వేదవ్యాసుడై పంచమ వేదమని పేరుబడసిన మహాభారతేతిహాసాన్ని రచించి చిర యశస్కుడు కాగా కుంతి పుత్రుడు సూతపుత్రుడుగా అనేక అవమానాలకి గురయి శాపగ్రస్తుడై జీవితమంతా వ్యథార్తుడై చివరకి వీర మరణం పొందాడు.

వీరిద్దరు కూడ కన్యలకు జన్మించినవారే అయినా వీరిద్దరి జీవితాలలో ఇంతటి వ్యత్యాసం ఎందుకు కలిగింది? పుత్రోదయవేళ వారి వారి తల్లుల హృదయాంతర్గతమయిన భావాలే దీనికి కారణం. గర్భవతుల యొక్క మానసిక ప్రవృత్తుల ప్రభావం గర్భస్థ శిశువుపై పడుతుందని నేటి శాస్త్రవేత్తలు కూడ అంగీకరించారు కదా! సత్యవతి కన్యగా తల్లి అయినా ఆ సమయంలో ఆమెకి ఎట్టి వాంఛగాని చాంచల్య బుద్ధిగాని లేక నిర్మల మనస్కురాలై వుంది. పరాశర మహర్షి లోక కళ్యాణార్థం ఒక మహాపురుషుని సృజించే తలంపుతో ఆమెను ఆ కార్యానికి సాధనంగా స్వీకరించి ఆమె కన్యాత్వం దూషితం కాకుండా వరమిచ్చి ఒక మహా కార్యానికై ఆ మునిశ్రేష్ఠుడు. సత్యవతి కూడ ఎట్టి చాంచల్యానికి లోనుగాక కేవలం ఋషి ఉత్కృష్ట వాంఛితం నెరవేర్చే ఒక మహత్కార్యానికై సంపూర్ణ మాతృత్వంతో నిష్కల్మష హృదయంతో సహకరించింది. అందువలనే ఆమె పుత్రుడు అంతటి మహా పురుషుడయాడు.

ఇక కుంతి, ఈమె కర్ణుని కన్నది కేవలం తన చాంచల్య బుద్ధి చేతనే. బాల్యంలో సహజంగా వుండే చపల బుద్ధి చేతనే [illegible] ఈమె దూర్వాసుడంతటి మహాముని ఇచ్చిన వరానే పరీక్షింప దలచింది. అమాయకపు పసి పిల్లవాడు జిజ్ఞాసతో దాన్ని ముట్టుకుని చేయి కాల్చుకున్నట్లే ఈమె ఋషి ఇచ్చిన తపఃఫలం ఫలిస్తుందో అనే జిజ్ఞాసలో చేయి కాల్చుకుంది. కర్ణుడు తానై ఏ అపరాధం చేయకపోయినా తల్లి చేసిన నేరానికి శిక్ష అనుభవించాడు.

ఈ విధంగా వేదవ్యాస కర్ణులిరువురు కానీనులే అయినా వారి జనన కాలమందు వారి వారి తల్లుల మనస్సులలో అంతర్లీనంగా వున్న భావాలకు అనుగుణంగా వారి జీవితాలు సాగాయి.

సత్యవతికి తాను కన్యగా తల్లి అయినందుకు ఏనాడు చింతించవలసిన అగత్యం ఏర్పడలేదు. కాని కుంతి తాను తల్లి అయిన మరుక్షణంలోనే చింతించవలసిన అవసర మేర్పడింది. సంఘానికి వెరచి పసిబిడ్డని గంగపాలు చేయటమే కాక కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సమయంలో కూడ తన పుత్రుని గుర్తించి కూడ ఆ విషయాన్ని వెల్లడి చేయలేని దౌర్భాగ్య స్థితిలో వుండవలసి వచ్చింది. అప్పటికి తాను దూర్వాసుని వలన పొందిన వర విషయం లోకానికి విదితమయే వుంటే ఆ వర ప్రభావంతో మరి ముగ్గురు పుత్రులను కూడ పొందివుంటే అయినా తన పుత్రుడు తన సమక్షంలోనే సూత పుత్రుడని అవమానింపబడుతుంటే నోరు మెదపలేకపోయింది. దీనికి కారణాలు రెండు. మొదటిది తాను

ఆనాడు చాంచల్యబుద్ధితో చేసిన తప్పిదాన్ని వెల్లడించుకోవడానికి తప్పు చేసాననే న్యూనతాభావంలో మాట పెదవి దాటకపోవడం. రెండు ఆనాటి ధర్మం ప్రకారం క్షేత్రజుడు ఔరస పుత్రునితో సమానుడు. క్షేత్రజుడనగా తనయొక్క భర్త సంతానోత్పత్తికి అశక్తుడగుట గాని లేక అట్టి కార్యమందు ఇచ్ఛ లేనివాడుగాని అయినపుడు భార్య భర్తయొక్క అనుమతితో వేరొక పురుషుని వలన పుత్రుని కన్నపుడు ఆ పుత్రుడు భర్తయొక్క సంతానం గానే పరిగణింపబడి క్షేత్రజుడై ఆతని వారసుడవుతాడు. భర్త అనుమతి లేనిదే భార్య పరపురుషుని పొంది సంతానవతి అయితే ఆ సంతానం అక్రమ సంతానంగానే పరిగణింపబడుతుంది. అట్టి పుత్రుడు ఆమె భర్తకు వారసుడు కాలేడు. కుంతి ధర్మార్జున భీములను భర్తయొక్క అనుమతితో కన్నది. కనుక వారు క్షేత్రజులై పాండురాజు సంతతిగా పరిగణింపబడ్డారు. కాని కర్ణుడు ఆమె కన్యగా ఉన్నపుడు జన్మించడంచేత భర్త యొక్క అనుజ్ఞ అనే ప్రశ్నే లేదు. ఇక కన్యావస్థ యందు తనకు సంరక్షకుడయిన తండ్రి అనుమతి కూడ ఆమె పొందలేదు. కనుక కర్ణుడు మహాతేజో సంపన్నుడు సృష్టికంతటికి ఆధారభూతుడు అయిన సూర్యభగవానుని పుత్రుడయినా క్షేత్రజుడు కాలేక పోయాడు. అందుచేతనే ఆమె నోరు మెదపలేకపోయినది.

సత్యవతికి ధర్మబద్ధంగా కన్న సంతానం అక్కరకు రాలేదు. కన్యగా కన్నపుత్రుడే వంశోద్ధారకుడయేడు. సత్యవతి తాను కన్యగా కన్న పుత్రుని వలన అత్యంత కీర్తిమంతురాలు కాగా కుంతి తాను కన్యగా కన్న పుత్రునికై జీవితాంతం దుఃఖించవలసిన అగత్య మేర్పడింది.

ఈ విధంగా కన్యగా తల్లులయిన ఈ స్త్రీ లిరువురు పుత్రోదయవేళ తమ మనోవీధులలో పరిభ్రమించిన భావాలను బట్టి ఆ క్రియకు ప్రేరేపించిన పరిస్థితులను బట్టి తాము పొందడమే కాక ఆ ప్రభావం తమ పిల్లలకు కూడ సంక్రమింప జేసారు.

## శిధిల మందిరం

నా మనసు తలపులు
శిధిలావస్థలో ఉన్నాయి
వాటి వయస్సులో ఉన్నప్పుడే
చెదలు పట్టాయి.
ఏ నిమిషములోనయినా ఆ తలపులు
తునాతునకలయి చూర్ణమవ్వచ్చు
ఎందరో నిరాశ్రయులకు ఆశ్రయ మివ్వడానికి
తృణీకరించిన నా మనోమందిరం
ఒకరికి ఘనస్వాగత మిచ్చింది
ఆహ్వానించబడిన ఆ బాటసారికి
నా మనోమందిరంలోని అందాల
చూడలేకపోయాడు సరకదా
అ[illegible]త చూపించాడు
ఫలితమే! ఈ శిథిల మందరం

— హరిణి

## దీపావళి

నీ కండలు పిండి చేసి నరాలు సాగదీసి
నీ యజమానికి తగిన ఫలితాన్ని అందచేస్తే
నీ శ్రమను గుర్తించి నీకు తగిన
పారితోషికం ఇచ్చినవేళ
నీ నయనాల ప్రాంగణములో
వెలిగే ఆనంద దీపాలు
విరజిమ్మే కాంతి కిరణాలు
చూసిన నా కన్నులలో
సంతోష వీచికలు
ఉవ్వెత్తున లేచినపుడు
నాకదే దీపావళి
లేనినాడు నాకది అమావాస్య.

— శ్రీ ఆచంట వెంకట సీతారామమూర్తి

# క ల గూ ర గం ప

## "సిరి పంచి కుడుచుట మేలు" అని వక్కాణించిన భీష్మాచార్యుని సందేశం

గంగాదేవికి పుట్టినవాడు గాంగేయుడు. పౌరుష నామం భీష్ముడు. ఇతను భారతీయుల యావన్మంది గౌరవాభిమానాలను పొందాడు. ఆనాటి ఆ ప్రపంచ్కుల నిర్ణయించేందుకు కురుక్షేత్రంలో కురుపాండవ సంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో భీష్ముడు అస్త్ర పరిత్యాగం చేసి, అంపశయ్యపై శయనించాడు. 58 రోజులు గడిచాక, ఉత్తరాయణ పుణ్యకాలంలో కీర్తిశేషు డయాడు. ఇట్టి మహామనీషి ప్రతిజ్ఞా పాలనను, అమర సందేశాన్ని మన నైతికోన్నతికి ఒక్కమారు స్మరించడం అవసరం.

"సంపదను అందరూ పంచుకొని అనుభవించుట ఎప్పుడూ శ్రేయస్కరం" అని భారతీయులకు, విశ్వజనానికి తన సందేశాన్ని వినిపించాడు భీష్మ పితామహుడు. ఇట్టి సర్వోన్నత సందేశాన్ని యిచ్చేందుకు మహాభారత సంహితలోని అన్ని పాత్రలకంటె మిన్నయైన పాత్ర భీష్ముడని, మహాతత్వవేత్త శ్రీ దామోదర ధర్మానంద కోసంబి అంటాడు.

శతపథ బ్రాహ్మణ – జయేతిహాసాలనుబట్టి, శంతనుడు చంద్రవంశపు మహారాజు. కురు సామ్రాజ్యానికి పూర్ణచంద్రుడు. గంగా – శంతనుల కుమారుడు భీష్ముడు. ఇతను శైశవ బాల్య దశల నుండి యౌవనదశ వరకు తల్లివద్దనే ఉన్నాడు. ఈ దశలో మహర్షి శ్రేష్ఠుడైన వశిష్ఠుని వద్ద వేద వేదాంగాలను, ప్రతాపశాలి భగవాన్ పరశురామునివద్ద ధనుర్విద్యను అభ్యసించాడు. ఆచార్య బృహస్పతితో ఉపమించదగ్గ శాస్త్రజ్ఞానిగా, ఆచార్య శుక్రునితో పోల్చతగిన, నీతి శాస్త్రజ్ఞునిగా ప్రౌఢతను సముపార్జించాడు. గంగాదేవి తనయుని తిరిగి శంతనునికి అప్పగించింది. శంతనుడు పట్టరాని ఆనందం పొందాడు. కొడుకును యువరాజుగా పట్టాభిషేకం చేశాడు. గాంగేయుడు తన శక్తిసామర్థ్యాలతో, సుగుణ సౌహార్దంతో జనహృదయ సింహాసనంలో ఉన్నత స్థానాన్ని పొందాడు. అలా నాలుగేళ్లు గడచాయి.

ఒకనాడు శంతనుడు యమునా నదీతీరాన విహరిస్తున్నాడు. విశాల వినీల నేత్రాలతో, దివ్య సౌందర్యంతో, విద్యుల్లతలా మెరుస్తూ ఒక కన్య కంటబడింది. ఆమెను చూచి, తన్మయు డయాడు. మోహించాడు. ఆమె పేరే సత్యవతి. ఆమె తండ్రి దాసరాజని తెలుసుకొన్నాడు. అతనిని సమీపించి, సత్యవతిని తన కిచ్చి వివాహం చేయమని కోరాడు. ఆమె కుమారుడు కురు సామ్రాజ్యానికి సర్వాధికారి కావాలి. అందుకు సమ్మతిస్తే అభ్యంతరం లేదన్నాడు. కాని శంతనుడు అంగీకరించలేక పోయాడు.

తండ్రి ఇంద్రియ వాంఛ – తనయుని త్యాగం :-

అటు సత్యవతిపై మోహం–ఇటు గాంగేయునిపై మమకారం వదలలేక – శంతనుడు మనస్తాపాన్ని అనుభవిస్తున్నాడు. గాంగేయుడు తండ్రి వేదనకు కారణం తెలుసుకొని, తానే దాసరాజు వద్దకు వెళ్ళేడు. సత్యవతి పుత్రుడే కురు సామ్రాజ్యానికి సర్వాధికారి అవుతాడని, తాను యికమండి బ్రహ్మచర్యం అవలంబిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. సత్యవతీ – శంతనుల వివాహం జరిగింది. వారికి చిత్రాంగదుడు, విచిత్రవీరుడు అను కుమారులు పుట్టేరు. వీరు యౌవన ప్రాంగణంలో అడుగు పెడుతూన్నారు. ఇంతలో శంతనుడు పరలోకగతుడయాడు.

గంధర్వ రాజులతో జరిగిన యుద్ధంలో చిత్రాంగదుడు చనిపోయాడు. కురు సామ్రాజ్యానికి అధినేతగా విచిత్రవీర్యునికి పట్టం కట్టారు. అతనికి వివాహం చేయతలపెట్టారు. కాశీరాజు తన కన్యల స్వయంవరం ప్రకటించాడు. భీష్ముడు స్వయంవరానికి వెళ్లేడు. భీష్ముని చూచినవారంతా "బ్రహ్మచర్య ప్రతిజ్ఞా పాలకుడు" వివాహవాంఛతో వచ్చేడని విస్తుపోయారు. అచటి రాజుల నందరినీ ఓడించి, అంబ, అంబిక, అంబాలికలను హస్తినాపురానికి తీసుకొని వచ్చాడు. అంబ తాను సాళ్వుని ప్రేమించానని భీష్మునితో చెప్పింది. ఆమెను వెనువెంటనే సాళ్వుని వద్దకు పంపేడు. అంబిక, అంబాలికలను – విచిత్ర వీర్యునకు యిచ్చి వివాహం చేశాడు. హద్దుమీరిన మోహావేశంతో ఇంద్రియ వాంఛలకు అంకితమయారు.

**ప్రతిజ్ఞా భంగంకన్న మరణమే మిన్న :-**

జీవిత పుష్పాన్ని సాళ్వుని పాదసేవకు అంకితం చేద్దామని వెళ్ళిన అంబకు నిరాశే ఎదురైంది. పరపురుషుడు అపహరించిన కన్యను తాను పరిగ్రహించనన్నాడు. తిరిగి వచ్చినా తిరస్కారమే లభించింది. తనను తిరస్కరించిన, భీష్ముని సంహరించాలని నిశ్చయించుకొంది అంబ. శరణాగత వత్సలుడైన పరశురాముని శరణు వేడింది. పరశురాముడు అంబతో సహా భీష్ముని సమీపించి, అంబను వివాహం చేసుకోవడమో! యుద్ధంలో మరణించడమో! నిశ్చయించుకోమన్నాడు.

"సాళ్వుని యందు తన హృదయం లగ్నమైందని అంబ చెప్పటచే ఆమెను సాళ్వునివద్దకు పంపేను. ఇప్పుడామె వివాహం నా సోదరునితో జరగడం అసంభవం. నేను దయతో గాని, భీతితో గాని బ్రహ్మచర్యాన్ని వీడి ప్రతిజ్ఞాభంగం చేయలేను" అని భీష్ముడు శాంత వచనాలతో, వినమ్రుడై గురుదేవునికి మనవి చేశాడు. కాని పరశురాముడు అంగీకరించలేదు తాను యిచ్చిన వాగ్దానం భంగపడరాదని పరశురాముడు - తన బ్రహ్మచర్య ప్రతిజ్ఞ భంగపడరాదని భీష్ముడు - ఇరువురూ యుద్ధానికి సంసిద్ధులయారు. భీష్ముడు తన రథం దిగి, మునిప్రవరుడు, గురుదేవులు అయిన పరశురామునికి ప్రణమిల్లి, "మహాత్మా! మీరు నాకంటే శక్తిమంతులు. మీతో యుద్ధానికి సన్నద్ధంగా ఉన్న నన్ను క్షమించి, ఆశీర్వదించండి" అన్నాడు. 21 రోజులు యుద్ధం సాగింది. రెండు అగ్ని పర్వతాలు ఢీకొన్నాయి. పరశురాముని బాణాహతికి భీష్ముడు ఒకమారు, భీష్ముని బాణాహతికి పరశురాముడు మరొకమారు మూర్ఛపోయేవారు. ఇలా అనేకమారులు. ఎవరూ ఎవరినీ ఓడించలేకపోయారు. దివ్య పురుషుల ఐక్యంతో, గురుబ్రహ్మ పరశురామునికి భీష్ముడు పాదాభివందనం చేశాడు. పరశురాముడు అస్త్రవిసర్జన చేసి, మహేంద్రగిరిపై తపస్సుకు వెళ్ళిపోయాడు. యుద్ధంకన్న ప్రతిజ్ఞాపాలన మిన్న గాంగేయునికి.

**వంశమూ-రాజ్యమూ అంతరిస్తున్నా-పట్టువీడని భీష్మ ప్రతిజ్ఞ :-**

అతను మరొక దుష్పరిణామం ఎదుర్కోవాల్సి వచ్చింది. విచిత్రవీర్యుడు భోగలాలసలో మునిగిపోయాడు. ఇంద్రియ భోగాలు ఎప్పుడూ దుఃఖ హేతువులే! రోజురోజుకూ బ్రాణ తగ్గి, నిస్తేజుడై, రోగగ్రస్తుడై చివరకు అకాల మరణం పొందాడు. దాసరాజు ఎందుకోసమైతే భీష్మునిచే ప్రతిజ్ఞ చేయించాడో, అది విఫలమైంది. సత్యవతి తన యిద్దరు తనయుల అకాల మరణానికి శోక సముద్రంలో మునిగిపోయింది. కురువంశం అంతరించింది. రాజు లేక రాజ్యం అరాజకమవుతోంది. శత్రురాజులు కురు రాజ్యంపై దండెత్తేందుకు సమయం కోసం పొంచి ఉన్నారు. మంత్రి సామంత పురోహితులు ఏమీ తోచక ఎదురు తెన్నులు చూస్తున్నారు. మహోన్నత శిఖరాలను చేరిన కురు సామ్రాజ్య వైభవాన్ని రక్షించే దిక్కులేదు, క్రమ్ముకొయే కాల మేఘాలు ప్రతీ ఒక్కరి మనస్సునూ ఖేద మొనరిస్తున్నాయి. గాంగేయుడే తన ప్రతిజ్ఞను వదలించి, ప్రజాకోటిని సంరక్షించాలని అందరూ ఆకాంక్షించారు. అంతేకాదు. సత్యవతి కూడ ఒక రోజున భీష్మునితో యిలా అంది, "నాయనా! నాకోసం నువ్వు చేసిన ప్రతిజ్ఞను వదలించి, నాశనోన్ముఖమైన కురు సామ్రాజ్యాన్ని, కురు వంశాన్ని, మనలనే నమ్ముకొన్న ప్రజలను రక్షించు. వివాహం చేసుకో - లేక - నీ తమ్ముని భార్యలకు పుత్రభిక్ష పెట్టి వంశాన్ని, రాజ్యాన్ని నిలుపు" అని ప్రాధేయపడింది. మంత్రి సామంత పురోహితులు ఒక్కుమ్మడిగా గాంగేయునిపై ఒత్తిడి చేశారు.

**భీష్ముడిలా అన్నాడు :-**

"మీరు చెప్పింది ధర్మసమ్మతమే! కాని రాజ్యాభిషేకానికి గాని, స్త్రీ సమాగమాన్ని గాని నా మనస్సు అంగీకరించదు. నా ప్రతిజ్ఞ మీరెరుగంది కాదు. నేను స్వర్గ సుఖాలను, త్రిలోకాధిపత్యాన్ని తృణప్రాయంగా వదలగలను గాని, నా ప్రతిజ్ఞను ఏమాత్రం భంగపరచలేను. పృథ్వి గంధాన్ని, అగ్ని తేజస్సునూ, వాయువు స్పర్శనీ, ఆకాశం శబ్దాన్నీ, చంద్రుడు శీతలాన్ని, సూర్యుడు ప్రకాశాన్నీ వదలి గతులు తప్పినా నా ప్రతిజ్ఞ మాత్రం గతి తప్పదు."

నీతులు ప్రపంచంలో పరోపదేశానికే గాని తమకు కావని కొంతమంది విశ్వాసం. కాని భీష్ముడు 'అది వట్టి వంచన అని నిరూపించి, భీష్మునిగా అమరుడయాడు.

చేసేది లేక పరాశర వ్యాసుని ద్వారా కురు సామ్రాజ్య నేతలైన ధృతరాష్ట్ర, పాండురాజులు పుట్టేరు. వీరి సంతానం కౌరవ-పాండవులు. రాజ్యం అవిభాజ్యమని, కౌరవులు పంపదను

నిర్ణయించి అమలవించాలని పాండవులు కురుక్షేత్రంలో సంగ్రామం సాగించారు. యుద్ధం ఉధృతంగా ఉంది. భీష్ముని సర్వసేనాధి పత్యంలో 10 రోజులు కౌరవసేన జయాన్ని పొందుతోంది. పాండవులు భీష్ముని సలహా మేరకు "శిఖండి"ని ఎదుర పెట్టు కొని, భీష్మునితో యుద్ధం ప్రారంభించారు. భీష్ముడు తనను శరణువేడిన వానితోగాని, స్త్రీలతో గాని, స్త్రీ నామాంకితులతో గాని, అమంగళ ధ్వజునితో గాని, ఏకైక పుత్రునితో గాని, యుద్ధం చెయ్యడు. శిఖండి, అమంగళ ధ్వజుడు కూడ. అందుచే భీష్ముడు రణరంగం నుండి వైదొలగి, స్వచ్ఛంద మరణం కోసం అంపశయ్యపై పరున్నాడు. భీష్ముడు కౌరవ పాండవులకు అనేక అమూల్య సందేశాలను యిచ్చాడు. జగత్తు పరిణామశీల మన్నాడు. జడం కాదన్నాడు. సత్యం పలకాలి, అసత్య మాడకూడదంటూ దానికి విశేషార్థం చెప్పాడు. పలికే సత్యం హితమై ఉండా లన్నాడు. దానిని సోదాహరణంగా చెప్పాడు. ఒక స్త్రీని ముష్కరులు తరుముకు వస్తున్నారు. ఆ స్త్రీ తప్పించుకొని మరొక మార్గాన వెళ్ళింది. అక్కడున్న ఒక ఋషిని ఆ ముష్కరులు ఆ స్త్రీ ఎటు వెళ్ళిందని అడిగారు. నిజం చెబితే ఆ స్త్రీని ముష్కరులు చెరపడతారు. ఆ దుర్మార్గానికి తాను కారణమవు తాడు. అందుచే ఆ ఋషి స్త్రీ వెళ్ళిన మార్గం కాక మరొక మార్గాన వెళ్ళిందని చెబుతాడు. ఇందులో హితం ఉండుటచే ఇది అసత్యం కాదు, సత్యమేనంటాడు భీష్ముడు. మానవులు శాంతచిత్తంతో ఉండాలనేదానికి భీష్ముడు అవ్రతత చెబుతూ, బలి చక్రవర్తి తన మనుమడైన ప్రహ్లాదుని చెప్పిన విషయాన్ని ఉదాహరించారు.

శ్లో॥ నిత్యేజ స్వతతం తేజో న నిత్యం శ్రేయసీ క్షమా
తస్మాన్నిత్యం క్షమా తాత! పండితై రపవాదితా॥

ఎప్పుడూ కోపంగా ఉండటం ఎంత తప్పో, ఎప్పుడూ శాంతంగా ఉండటం కూడ అంతే తప్పంటాడు.

ప్రభుత్వ ఆవిర్భావం గూర్చి దాని పరిణామం గూర్చి భీష్ముడు విను తొల్లి కృతయుగంబున దండనీతిమంతుండైన రాజు లేడు. ప్రజలు ధర్మానువర్తులై ఉండేవారు. కాలక్రమేణ ప్రభుత ఏర్పడింది.

భీష్ముడు వివాహ వ్యవస్థను గూర్చి యిలా అన్నాడు:

"మానవులకు వయస్సుతోపాటు మాంసభక్షణ - మధుపానం - మైధునం స్వతస్సిద్ధంగా వస్తాయి. ఆదిమదశలో యివి విశృంఖలంగా ఉండేవి. వాటిని వ్యవస్థీకరించారు. సౌత్రామణి యజ్ఞాన్ని ఏర్పరిచి, ఆ సమయంలో మాంసభక్షణ, సురాయజ్ఞ కాలంలో మధుపానం, వివాహాంవల్ల మైధున క్రియలను చేయా లన్నారు. అందుకు విరుద్ధంగా ఆచరించడం వ్యభిచారం (శ్లో॥ లోకే వ్యవాయా మిషమద్యసేవా నిత్యాస్తు జంతోర్నహి తత్ర చోదనా....)

మంచి రాజ్యవ్యవస్థ అని నిర్ణయించేందుకు ఒక పరీక్ష సంఘటనను వివరించాడు భీష్ముడు: ఒక యవ్వన స్త్రీ సర్వాభరణ శోభితయై అర్ధరాత్రి ఒంటరిగా నడివీధిలో నడచి క్షేమంగా తిరిగి రాగలిగిన స్థితి గలిగినదే మంచి రాజ్యపాలన అన్నాడు. దీనినే గాంధీ మహాత్ముడు పలుసార్లు పలికేరు.

ధర్మ నిర్ణయం గూర్చి ఒక సుదీర్ఘ వివరణ యిచ్చాడు.

శ్లో॥ తర్కోఽప్రతిష్ఠ శ్శ్రుతయోపి భిన్నా
నైకో ఋషిర్యస్యవచః ప్రమాణమ్
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయా
మహాజనో యేన గతస్స పంథాః॥

తర్కము సుస్థిరమైనది కాదు. ఏ తర్కంతో ఒక విషయాన్ని రుజు చేయగలమో అదే తర్కంతో దానికి విరుద్ధంగాను రుజు చేయగలం. సగం నీరున్న చెరువును ఒకడు సగం ఎండిందని, మరొకడు సగం నిండిందని అనవచ్చును. ఒకడు తీక్ష్ణమైన ఎండను వెన్నెలగా రుజు చేయవచ్చును. వెన్నెలకు వేడి వచ్చుటచే, ఎండగా గోచరిస్తుంది. ఆ వేడికి కారణం సముద్రంలో బడబాగ్ని పుట్టింది. అందుచే వెన్నెలకు చల్లదనం పోయి వేడి సంక్రమించిందంటాడు. కేవల తర్కానికి స్థిరత్వం లేదు. అందుచే మార్క్సిస్టు పండితులైన డి. డి. కోసంబి, లాజిక్ అండ్ ఎక్స్పెక్టు జీవితం కాదు అంటాడు.

ఏ ఋషి వచనాన్ని మనం ప్రమాణంగా తీసుకొంటాం. ఒక ఋషి మరొక ఋషి వచనానికి విరుద్ధంగా చెప్పారు. "మాతృదేవోభవ" అన్న వచనాన్ని తిరస్కరించి, పరశురాముడు తండ్రి మాట విని తల్లిని చంపేడు. అందుచే ధర్మం అన్నది చాల రహస్యమైనది. అధిక జనానీకం ఏ పంథాను అనుసరిస్తే, అదే ధర్మం అన్నాడు భీష్ముడు. "పదువురాడు మాట పాటియై చెల్లు ధర.

భీష్ముడు తన తుది సందేశంలో "సిరి పంచి కుడుచుట మేలు" - సంపదను పంచుకొని, అందరూ అనుభవించుట మేలు- అని వక్కాణించాడు. సమాజానికి నూతన రూపురేఖలు దిద్దే ప్రభుత్వాలకు - ప్రజలకు దీపికా యీ సందేశం.

డా॥ మాడభూషి భావనాచార్యులు

# గమక కళ – జోళదరాశి దొడ్డనగౌడ

భారతి (ఫిబ్రవరి 1990)లో 17వ శతాబ్దంనాటి బెణకయ్య అనే గమకి గురించిన వ్యాసాన్ని చదివితిని. ఆ వ్యాసంలో గమకి కుండవలసిన లక్షణాలనూ వ్యాసకర్త లిచ్చిరి.

బెణకయ్య గమక పఠన మెట్లుండేదో నాకు తెలియదు కానీ వ్యాసకర్త లిచ్చిన గమకి లక్షణాలుండే ఒక వ్యక్తి నాకు తెలుసును. వ్యాసకర్తలు (నేనూ) వుండే అనంతపురం పట్టణం నుండి బళ్లారి పట్టణానికి బస్సులో పోయే రోడ్డు ప్రక్కనే బళ్లారికి దగ్గర, జోళదరాశి అనే గ్రామముంది. అందు దొడ్డనగౌడు అనే దొడ్డ మనిషి వున్నాడు నేడు సహస్ర మాస జీవి.

జోళదరాశి దొడ్డనగౌడుగారు మంచి గమకి. 1943వ సంవత్సరం అనంతపుర, దత్తమండల కళాశాల (దీనినిప్పుడు గవర్నమెంటు ఆర్ట్స్ కళాశాల అంటారు). కన్నడ సంఘంలో శ్రీ చిలుకూరి నారాయణరావుగారి సమక్షాన శ్రీ దొడ్డనగౌడుగారు లక్ష్మీశుని కన్నడ "జైమిని భారతం"ను గమక పద్ధతిలో పఠించి యుండిరి. నేనప్పుడచటవుండి విన్నాను. నేను పోర్త్ ఫారం చదువుతుండేవాడిని. కరుణ, వీర రసాలు ఎట్లుంటాయో నాకప్పుడు తెలిసినాయి. శ్రీ దొడ్డనగౌడుగారు గాయకులు, నటులు, పండితులు. బళ్లారి రాఘవ సహచరులు. బళ్లారి రాఘవ రామదాసుగానూ, దొడ్డనగౌడు కబీరుదాసుగానూ నటించిన "భక్త రామదాసు నాటకాన్ని నేను 1944వ సంవత్సరం అనంతపురం ఎక్సెల్సియార్ టాకీసు థియేటరులో చూచినాను.

శ్రీ దొడ్డనగౌడుగారు గొప్ప గాయకులు అన్నాను. వీరి "మనవెంబో మంగవు, ఎన మాతు కేళదు, ఏనుమాడలి, నానేను మాడలి" అనే పాట, "దాసర నిందిస బేడ మనుజ" అనే పాట గ్రామఫోను రికార్డయినాయి. వీరి పాట బాణి శ్రీ హరీంద్రనాథ చట్టోపాధ్యాయ (ఈయన గాయకుడు, నటుడు, కవి) పాడే రీతిలో వుంటుంది. శ్రీ హరీంద్రనాథుడూ సహస్రమాస జీవి, మనమధ్య ఉన్నాడు. శ్రీ హరీంద్రుడు పాడిన "నపలోకి ....", "సూర్య అస్తహోగయా" (విప్లవ మూర్ఛసేస్ పైన) అనే గ్రామఫోను పాటలు వినండి. ఇప్పటికీ శ్రీ హరీంద్రుడు పాడుతాడు.

శ్రీ జోళదరాశి దొడ్డనగౌడు కర్నాటాంధ్ర సంస్కృతుల కూడలి.

బెంగాలీ భాషలో పంకజకుమార్ మల్లిక్ గొప్ప గాయకుడే కాక కావ్యపఠనంలోనూ, శ్లోక పఠనంలోనూ అద్వితీయుడు. దసరా సమయాన (మహాలయ అమావాస్య) కలకత్తాలో రాత్రంతా దుర్గా స్తోత్రాలు (చండి, చాముండి, మహిషాసురమర్దిని) పురాణాల నుండి శ్లోకాలను బీరేంద్ర కృష్ణ భద్ర వంటి ప్రవీణుల చేత రోమాంచకారిగా పాడించేవాడు పంకజకుమార్ మల్లిక్. "యాత్రిక్" బెంగాలీలో "మహాప్రస్థానేర్ పథే", సినిమా (1953)లో, కాళిదాసు "కుమార సంభవ" కావ్యంలో ప్రారంభంలో కల "అస్త్యుత్తరస్యాం"తో మొదలయ్యే హిమాలయ వర్ణన శ్లోకాలను ఈయన పఠించిన తీరు ద్వారా హిమాలయాలు కన్నులముందు ప్రత్యక్షమవుతాయి. కావ్యపఠనం వేరు, కావ్య గానం వేరు. ఋగ్వేదానికీ, సామవేదానికీ ఉన్నంత తేడా కావ్య పఠనమే గమకము. కర్ణాటకలో శ్రీ పండరినాథాచార్య 'గలగలి గారి శ్లోక పఠనారీతి అనిర్వచనీయ సౌందర్య పూరితము (కంఠం, ఉచ్ఛారణ, కాకువులలో). తెలుగులో గొప్ప కావ్యవాచకులున్నారు. భమిడిపాటి కామేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, సినారె, దాశరథి, పుట్టపర్తి, సుబ్బన్న శతావధాను లందులో కొందరు. ఆంధ్రదేశంలో 60 క్రిందవరకు మంచి పురాణ ప్రవాచకులుండేవారు. శ్రీజల సూత్రం రుక్మిణీనాథశాస్త్రి చదివిన కంకంటి "ఉత్తర రామాయణం" లోని సీతా పరిత్యాగ ఘట్టం మరువరాని కరుణానుభూతి. ఇది ఆకాశవాణి రికార్డు. కొక్కిరించే "జగన్నాథ జంబక్" ఇంతటి నిర్వేద కరుణలు కలిగించే విధంగా ఏలాగు పఠించెనని ఆశ్చర్యం కలుగక మానదు. ఇంగ్లీషులో శ్రీమతి సరోజినీ నాయుడు, ఆమె తమ్ముడు హరీంద్రనాథ చట్టోపాధ్యాయ (ఇద్దరూ ఇంగ్లీషు కవులే) ఇంగ్లీషు పద్యాలను చాలా విశిష్టంగా చదువుతారు. సుప్రసిద్ధ ఇంగ్లీషు నవలాకారుడు చార్లెస్ డికెన్స్, కవి డైలన్ థామస్ స్వీయ రచనలను పఠించే పద్ధతితో శ్రోతలను ఉర్రూతలూగిస్తారు. చార్లెస్ కింగ్స్లే వ్రాసిన "దీవదీపులివతలం" అనే పద్యాన్ని క్లాసులో మేస్టారు గట్టిగా చదివి వినిపిస్తుంటే, మేమేద్చేవాళ్ళం. మౌలికమైన ఈ గమక విద్య మనిషి గొంతులో స్వరపేటిక ("లారిన్క్స్") వుండేంతవరకూ ఉంటుంది.

—"శ్రీ"

# అజరామర రసధుని – మేఘసందేశం

కవి కులపతి కాళిదాసు, నిస్సంశయంగా, భారతీయ సాహితీ లోకానికి ప్రభువు. విశ్వసాహిత్య లోకంలో కూడ ప్రథమ పంక్తికి చెందిన కవితామూర్తి. అతనిని గూర్చి చెప్పిన–

"పురా కవీనాం గణనా ప్రసంగే
కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా
అద్యాపి తత్తుల్య కవే రభావా
దనామికా సార్థవతీ బభూవ

-అను భావము విశ్వసాహిత్యాన్ని పరిశీలిస్తే కొంచె మత్యుక్తిగా తోచవచ్చుగాని, కాళిదాసు విశ్వసాహిత్యంలో శ్రేష్ఠ మీద లెక్కింపదగినవారిలో ఒకడనడం మాత్రం సహజోక్తియే. కాళిదాసు రచనలు అధ్యయనం చేయందే భారతీయ సంస్కృతి మూలాలు పట్టుపడవు

ఇంత గొప్పవాడైనా, మన దేశానికి చెందిన ఇతర మహా పురుషుల్లాగే, ఈతని స్థల. కాల, వంశ వివరాలు సాధికారికంగా తెలియవు మన పూర్వులు అతి వినయాన్నో, సంప్రదాయం వల్లో, తమను గురించిన వివరాలు తామై ఇవ్వలేదు అందువల్ల వారి స్థల కాలాదులు, వారి సమకాలీన రాజుల చరిత్రల ద్వారానే, తెలిసికోవాల్సి వస్తుంది.

ఈతడు మాళవ దేశస్థుడనీ, ఉజ్జయినీ నివాసి యనీ విక్ర మార్క భోజుని ఆస్థానం అలంకరించాడనీ, క్రీస్తు వెనుక 1, 2 శతాబ్దుల వాడనీ, నేటి ప్రఖ్యాత పరిశోధకుల అభిప్రాయం

కాళిదాసు రచించిన అనేక గ్రంథాల్లో ప్రశస్తాంశమైన ఈ మేఘసందేశం ఒకటి. ఇది రసమయమైన అద్భుత ఖండ కావ్యం. లయ రాగ సమన్వితాలూ, గాన యోగ్యాలూ ఐన మందా క్రాంత వృత్తాల్లో కవి దీనిని కూర్చాడు. ఇందలి కథ పూర్తిగా కవి కల్పించింద

శాపగ్రస్తుడైన ఒకానొక యక్షుడు, ప్రియురాలికి మేఘం ద్వారా తన క్షేమ వార్త పంపడమే దీంట్లో ఇతివృత్తం. ఇట్టి కావ్యాల్లో ఇదే ఆద్యం.

క్రీ.శ. 2వ శతాబ్దికి చెందిన నూకాంగ్ అనే చైనీయ కవి తన కావ్యంలో మేఘుణ్ణి దూతగా చేసాడట అతడు కాళిదాసుకు తరువాత వాడవటంవల్లా, ఉజ్జయినీ తక్షశిలలతో తత్పూర్వం రెండు మూడు శతాబ్దాలుగా రాకపోక సంబంధాలుండటంవల్లా, ఇది కాళిదాసు ప్రభావంగా భావించవచ్చు.

కుబేరుడి కొలువులో ఉన్న ఒకానొక యక్షుడు, అధికార ప్రమత్తుడై, యజమాని కోపానికి గురియై, తన ప్రియురాలి నుండి, ఒక ఏడాది, దూరంగా గడపవలసిన శాపాన్ని పొందు తాడు. శాప కాలాన్ని జనకతనయా స్నాన పుణ్యోదకాలచే పవిత్రీకృతమైన, రామగిర్యాశ్రమంలో గడుపుతూ ఉంటాడు. ప్రియా విరహతాపాన్ని ప్రవర్ధింపజేసే వర్షఋతువు వస్తుంది. ఆషాఢమాసం మొదటిరోజునే, పర్వత సానువుల్లో దట్టంగా పట్టిన మేఘాన్ని చూసి కామార్తుడైన యక్షుడు, మేఘం ద్వారా యక్షిణికి కబురు పంపించ తలచుకుంటాడు. దానికై మేఘుణ్ణి ప్రార్థించి అలకాపురానికి మార్గాన్నీ, అలకాపురాన్నీ, ఇంటినీ, ఇల్లాలినీ వర్ణించి, ఇల్లాలికి చెప్పవలసిన సందేశం చెప్పి పంపి స్తాడు. ఈ నెపంతో కవి ఆయా భౌగోళిక పరిస్థితుల్నీ, నగ రాల్నీ, అడవుల్నీ, నదీనదాల్నీ, కొండల్నీ, లోయల్నీ, పుణ్య క్షేత్రాల్నీ, అద్భుతంగా, అవితర సాధ్యంగా కళ్ళకు కట్టినట్టు వర్ణిస్తాడు. ఎడనెడా అతని లోకవృత్త పరిశీలనం కూడా కనిపిస్తుంది.

శ్రీరామచంద్రుని క్షేమవార్త జనక తనయకు చేరవేసిన హనుమత్సందేశమే దీనికి ప్రేరకమని కావ్యంలో అక్కడక్కడా కనపడే రామాయణ సంబంధి ప్రసక్తాంశాలవల్ల గ్రహించవచ్చు.

మేఘసందేశ కావ్యాన్ని చదివిన అనేకమంది ప్రాచ్య పాశ్చాత్య పండితులు ఆనంద పారవశ్యంతో దీన్ననేక విధాలుగా కీర్తించారు. ఆర్. సి. దత్ "కాళిదాస మహాకవి కృత మేఘ సందేశం లిరికల్ కవితలలో వజ్రసన్నిభం. ఇది రసవత్ సంగీత భరితం కరుణ రసభరితం పాఠకుల అంతరాత్మను మాధురీ గుణంతో నింపే అసదృశ కావ్యం. సంస్కృత భాషలో గాని అన్యభాషలలో గాని దీనికి తుల్యమైన వేరొక కావ్యం కాన రాదు" అన్నాడు. రిడ్డు కవి "స్త్రీ పురుషుల మధ్యగల అమృత మయమైన ప్రేమను కాళిదాసువలె ఏ కాలంలోనూ, ఏ దేశం లోనూ, ఏ కవీ గానం చేయలేదు" అన్నాడు. అలెగ్జాండర్ వాన్ హంబోల్టు ఉద్దేశంలో "ప్రకృతి ప్రేమికుల మనస్సులపై చేసే విన్యాసాలను వర్ణించటంలో కాళిదాసు దిట్ట".

ఎందరిచేతనో, ఎన్ని విధాలుగానో కీర్తించబడ్డ ఈ మేఘసందేశ కావ్యం తరతరాలుగా పాఠకలోక హృదయాల్ని రసప్లావితం చేస్తూనే ఉంది. [illegible] అచేతనమైన ప్రకృతిని సచేతనంగా పేర్చిదిద్దిన కవి భావనా వైశిష్ట్యం ఈ కావ్యానికి ప్రత్యేకతనీ, [illegible] తనాన్నీ కల్గిస్తోంది. ఇందులో ధ్వని హృదయరంజకం. ఈ ధ్వని లాగానే ఈ కావ్యంలో కూడా మనోరంజకత్వాన్ని కలిగిస్తుంది. అసలు ధ్వనియే కావ్యానికి ప్రాణం అని విజ్ఞులంటారు. విధి విర్వహణా ప్రమత్తుడైన యక్షుని కీయబడిన శిక్ష మూలాన్నే, వాని చేసిన నేరం, కాంతాలోలత్వం సూచిత మవుతోంది. కనక

వలయం ధారిపడ్డమే శిక్ష కాఠిన్యాన్ని వ్యక్తీకరిస్తుంది. మేఘదూత కావ్యానికి ఆధారం ప్రకృతి. ప్రకృతి వర్ణనే ఈ కావ్యానికి ప్రాణం. కావ్యం రామగిర్యాశ్రమ వర్ణనతో ప్రారంభమవుతోంది. యక్షుడు, కామచారీ, ఆకాశగమన సామర్ధ్యం కలవాడూ కావటాన ఆ పాత్ర ద్వారా ప్రకృతి వర్ణన కళ్ళకు కట్టినట్లుగా వర్ణించడానికి వీలుపడింది. అసలందుకే కవి అట్టి పాత్ర ప్రవేశ పెట్టాడు. పూర్వ మేఘంలోని ప్రకృతి వర్ణన హృదయాన్ని ఉప్పొంగజేస్తూ, ఆ యా దృశ్యాల్ని పాఠకుల మనోనేత్రాలకు ప్రత్యక్షం చేస్తుంది. ప్రారంభిస్తూనే 'స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం' అనగానే చల్లని చిక్కని నీడలో ఆశ్రయం పొందిన యక్షుడితోపాటు ఆ ప్రశాంత శీతల వాతావరణం కూడా మనకు సాక్షాత్కరిస్తుంది. ఆషాఢమాసం రాగానే-

"ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ" అన్నాడు.

మేఘాన్ని గజరూపధారిగా చూస్తాడు యక్షుడు. గజ దర్శనం శుభానికి సంకేతం కదా! మేఘాన్ని సందేశార్థం ప్రార్థిస్తా మనుకుంటూనే ప్రీతి వచనాలతో, కుటజ కుసుమాలతో స్వాగతిస్తాడు. పుష్కలావర్తక మేఘాల వంశంలో పుట్టావని స్తుతిస్తాడు. నీవంటి ఉత్తముణ్ణి అడిగి లేదనిపించుకున్నా మంచిదే నంటాడు. లోకంలో ఎవరితోనైనా పని కలిగినపుడు వారిని ప్రసన్నం చేసికోడానికి కాస్త పొగడడం చూస్తూనే ఉన్నాం కదా! ఇక్కడ కాళిదాసు ఒక గొప్ప విషయం చెప్పాడు. "యాచ్ఞా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధ కామా" అన్నాడు. గుణవంతుణ్ణి అడిగి లేదనిపించుకున్నా మంచిదే. గౌరవానికి భంగం రాదు. అధమునిచేత పొందిన ఉపకారం చాల బాధాకరంగా పరిణమిస్తుంది. ఇది ప్రతివాడూ ఎల్లపుడూ ఆచరణలో జ్ఞాపకం పెట్టుకోవలసిన విషయం. కాళిదాస మహాకవి లోకవృత్త ప్రదర్శనను వీలయినపుడెల్లా నిక్షేపిస్తూనే ఉంటాడు.

మేఘాన్ని గూర్చి కాళిదాసు "ధూమజ్యోతిస్సలిల మరుతాం" అన్నాడు. ఇది శాస్త్రీయమైన అవగాహన. ఒక్క ధూమాన్ని మినహాయిస్తే మిగతా వర్ణన నూటికి నూరుపాళ్ళు నిజం. ఆ కాలానికే ఇంత శాస్త్రీయ అవగాహన కలిగి ఉండటం వాల విశేషమనే చెప్పాలి. ఈ విషయం ఆనాటి మన విద్యా వైజ్ఞానిక స్థాయిని తెలుపుతుంది. యక్షుడిట్టి అచేతనమైన మేఘాన్ని ప్రార్థించడం గూర్చి "కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేతనా చేతనేషు" అని సమర్థిస్తాడు కవి. "భ్రష్టుగి భ్రాతృ జాయాం" అంటాడు. అన్న భార్య తల్లితో సమానం కదా! యక్షునిలో లౌక్యానికి కొదువలేదు.

ఆమ్రకూట వనాన్ని వర్ణిస్తూ కాళిదాసు-

"ఛన్నోపాంతః పరిణతఫల ద్యోతిభిః కాననామ్రై
స్త్వ య్యారూఢే శిఖర మచలః స్నిగ్ధవేణీ సవర్ణే
నూనం యాస్యత్యమర మిథున ప్రేక్షణీ యామవస్థాం
మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తార పాండుః" అన్నాడు.

ఆమ్రకూటంలో అడవి మామిడిచెట్లు క్రమ్ముకొని తెల్లగా కనపడుతున్నాయి. దాని శిఖరమందు నల్లనివాడైన మేఘుడు వ్రాలితే భూమి స్తనమో అన్నట్లుండి దేవ మిథునాలకు వేడుక కలిగిస్తుందట.

మేఘుడికి వైద్యం కూడా చెపుతాడు యక్షుడు. వర్షించిన పిమ్మట (వమనము పిమ్మట; వాంతవృష్టిః అన్నాడు) తిక్తమూ, వన గజ మద వాసితమూ, జంబూ పత్ర, ఫల, యుక్తమూ అయిన జలపానం వల్ల బలం కలుగుతుందనీ, వాతం హరిస్తుందనీ చెప్తున్నాడు. నేరేడు పండునకున్న మధుమేహ నిరోధక గుణాన్నీ, దాని ఉపయోగాన్నీ అనుభవం వల్ల ఆనాటికే మన దేశీయులు తెలిసికొని ఉంటారనటాని కిదొక తార్కాణం.

నిర్వింధ్యా నదిని వర్ణిస్తూ కవి-

"వీచీక్షోభ స్తనిత విహగ శ్రేణి కాంచీగుణాయాం
సంసర్పన్త్యా స్ఖలిత సుభగం దర్శితా వర్త నాభేః
నిర్వింధ్యాయా పథిభవ రసాభ్యంతరః సన్నిపత్య
స్త్రీణా మాద్యం ప్రణయ వచనం విభ్రమోహి ప్రియేషు"
అన్నాడు.

వింధ్యాచల సానువుల ప్రవహించు నిర్వింధ్యా నది, నదిగా కాక నాయికగా దర్శనమిచ్చింది. సుళ్ళు తిరుగుతూ రాళ్ళపై ప్రవహించే నిర్వింధ్యా నది వడులు కట్టిన హంసల పంక్తి. అలల తాకిడికి సుదురంగా కూస్తూ ఉండగా, మొల నూలి ముప్పేలు కాలి తొట్రుపాటు నలా మ్రోయుచుండగా, నాభిని బయల్పడగా నడచిపోవు నాయికవలె ఉన్నదట. అలా నడవడం ఎంత అందమైన దృశ్యం! మాటతో కాక కేవలం విలాస క్రియతో అనురాగం ప్రకటించడం స్త్రీల స్వభావమట. కావున మేఘుడు ఆ నిర్వింధ్యా నాయికను కలిసి ఆమె అనురాగమును సఫలము చేయవలెనట. లేనిచో రసాభ్యంతరుడే కాడట. ఎంత అందమైన భావాన్ని ఎంత అందంగా చెప్పాడు!

అలాగే శిప్రా నదిపై నుంచి వచ్చే మారుతాన్ని గూర్చి చేసిన ప్రణయ వచన చతురుడైన ప్రేమికుని రూపకల్పన మనోజ్ఞంగా ఉంది.

"దీర్ఘీ కుర్వన్ పటు మద కలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటిత కమలా మోద మైత్రీ కషాయః
యత్ర స్త్రీణాం హరతి సురత గ్లాని మంగానుకూలః
శిప్రా వాతః ప్రియతమ ఇవ ప్రార్థనా చాటుకారః" అన్నాడు.

ఆ విశాలా పట్టణ సమీప మందలి తామరపూవులు గల శిప్రానది గాలి వేకువనే, శైత్య, సౌరభ్య, మాంద్యములతో కూడి, రతిశ్రమ గల స్త్రీల దేహాలు సోకి, సుఖముగా వారి శ్రమ దీర్చి, మరలా రతి గోరు ప్రియునిలాగా స్త్రీలకు భోగాభిలాష పుట్టించునట.

దుష్ట శిక్షణావసరాన్ని గూర్చి కూడా మేఘుడికి చెపుతూ యక్షుడు, నిష్ఫలారంభ యత్నశీలురకు గౌరవం రాదనీ, మేఘునిపై గజభ్రాంతితో దుముకు శరభాది దుష్ట జంతువుల్ని శిక్షించవలసిందేననీ చెపుతాడు. "కేవాసస్యుః పరిభవ పదం నిష్ఫలారంభ యత్నాః".

హిమాలయ పర్వత సానువులు దశముఖ భుజాస్ఫాలనం వల్ల సందులు సడలి ఉన్నవట. "దశముఖ భుజోచ్ఛ్వాసిత ప్రస్థ సంధేః" హిమాలయములు శంకరుని హాసము రాశీభూతమైనట్లున్నదట. "రాశీభూత ప్రతిదిన మివత్ర్యంబక స్యాట్టహాసః". ఎంత మనోజ్ఞము. తెల్లగా, ఎత్తుగా, స్వచ్ఛంగా రాశులు పోసిన హిమ సముదాయము శంకరుని నవ్వుల పువ్వులట. మేఘునికి హిమాలయోత్సంగంలోని ప్రస్త గంగాదుకూలమూ, వైభవోపేతమూ ఐన అలకా నగరాన్ని గూర్చి చెప్పాడు.

ఉత్తర మేఘం అలకాపుర వర్ణనతో ప్రారంభ మవుతుంది. అలకాపురం బాహ్యోద్యాన స్థిత హర శిరశ్చంద్ర చంద్రికా ధౌత హర్మ్యాలు కలదట. మొదట అలకాపురికీ, మేఘునికీ సామ్యం ఆపాదించబడింది. ఆరు ఋతువులూ ఏకకాలంలో శోభిల్లే అందమైన కాలం అక్కడ సిద్ధించును. కాళిదాసు నివసించిన ఉజ్జయినీ పుర వైభవమే అలకాపురం వర్ణనలో మనకు గోచరిస్తుంది.

"హస్తే లీలా కమల మలకే బాల కుందాను విద్ధం
నీతా లోధ్ర ప్రసవ రజసా పాండుతా మాననే శ్రీః
చూడాపాశే నవ కురవకం చారు కర్ణే శిరీషం
సీమంతేచ త్వ దుప గమజం యత్రనీపం వధూనాం".
అంటూ వర్ణిస్తాడు.

ఈ శ్లోకంలో అక్కడి స్త్రీలు ధరించు పద్మాలూ, మొల్లలూ, లొద్దుగ పరాగమూ, గోరింటా, దిరిసెన పూలూ, కడిమి పూలూ వర్ణించడం ద్వారా ఆరు ఋతువులనూ ఒకే కాలంలో దర్శింపజేసే అద్భుతాన్ని సాధించాడు కవి. అలకా నగరం కాళిదాసు 'ఉటోపియా' కాబోలు. అక్కడ దుఃఖం లేదు. రోగం లేదు. దరిద్రం లేదు, ముదిమీ లేదు. తన్నగర వాసులు గంగానదీ తీరాన బంగారపు టిసుక బయళ్లలో, కల్పవృక్షాల నీడలో వినోదిస్తారు. అచ్చటి రత్నదీపాలు నిరంతర కాంతి జనకాలు. అరవు. విద్యున్నిరోధ బాధ లేదు. అక్కడ శివుడు తన మిత్రుడైన కుబేరుని వీట అతిథిగా ఉండటం వల్ల భయపడి మన్మథుడు రాకున్నా వాని పనిని అచ్చటి కామినులే చేయగలరట.

యక్షుని భార్యను

"తన్వీశ్యామా శిఖరి దశనా పక్వ బింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకిత హరిణీ ప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణీ భారా దల సగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యాతత్రస్యా ద్యువతి విషయే సృష్టిరాద్యేవ ధాతుః"

-అని అనితరసాధ్యంగా వర్ణిస్తాడు. శిఖరి దశనా అనగా కొసలు సన్నముగా అందముగానున్న పలువరుస గలది. ఇప్పుడు కూడా కొన్ని గిరిజన తెగలలో స్త్రీలు పళ్లు త్రిభుజాకారంగా ఉండేటట్టుగా అరగదీయించుకొంటారు. అది ఆచారంగా పాటిస్తారు కూడా.

ఆమె మలిన వసన ధారిణి. నిరలంకార. భర్త దేశాంతర గతుడు కదా! అలవాటు కొలదీ ఒడిలో వీణ ఉంచుకొన్నదే కాని, కన్నీరు కారుస్తూ మాటిమాటికీ స్వరం నిలకడ మరిచిపోతోంది. విరహ బాధామగ్న యక్షిణిని హనుమంతుడు సీతాదేవిని చూసి నట్లుగా చూసి తన క్షేమవార్త తెలియజేయమన్నాడు మేఘునితో యక్షుడు. ఇంతసేపు మాట్లాడిన తరువాత ఎవరైనా మిత్రుడవు తాదు కాబట్టి మిత్రకార్యం చక్కబెట్టమన్నాడు. అడగకనే చాతకాలకు తృప్తి చేస్తావు కదా అడిగిన పని చేయకెట్లుండగలవు అని మేఘుణ్ణి విలదీస్తాడు. మొదట్లో 'యాచ్ఞా మోఘా వరమధిగుణే' అన్నవాడు చివర్లో చాతక పక్షులకు అడగకనే నీళ్లిస్తున్నావనే నెపంతో పని బాధ్యత పూర్తిగా నెత్తిపై పెట్టాడు.

సరే, మేఘుడు వార్త తీసికెళ్లాడు. కథ సుఖాంతమయింది. "తత్సందేశం జలధర వరో దివ్యవాచాచ చక్షే" అన్నాడు. జలద కథితమైన వార్తను ధనేశుడు కూడా విన్నాడు. మేఘం జల

పదార్థ సమ్మిశ్రితమని ముందే చెప్పాడు కదా! మళ్ళీ ఈ వార్త ఎలా చెప్పించాడో! ఈ శ్లోకాలు ప్రక్షిప్తాలు కావచ్చు.

మేఘదూతం మధుర మంజులమైన కావ్యమవటంవల్ల విశ్వసాహిత్యంలో దీనికెన్నో అనుకరణలు వెలువడ్డాయి. కాని వేనికివి మేఘదూతానికున్న పరిపూర్ణతా, పఠన యోగ్యతా, కమనీయతా, శ్రవణపేయతా రాలేదనే విజ్ఞులు చెపుతారు. దానికదే సాటి. చిన్నదే అయినా సర్వాంగ సుందరం. ప్రకృతి సౌందర్య ప్రదర్శకమూ, నియమబద్ధ శృంగారరసభూయిష్టమూ, పాతివ్రత్య ధర్మప్రవర్తకమూ, దంపతుల అన్యోన్యానురాగ వర్ధకమూ, లౌకిక వ్యవహార యుక్తమున్నూ అయిన మేఘసందేశం అద్వితీయమైన కవితాసృష్టి

కాళిదాసు రాజసభలో ప్రసంగవశాత్తు ఇదియొక ఛాలెంజిగా తీసికొని వ్రాసాడనిపిస్తుంది. ఇందులో కనపడే నియత దిఙ్నాగుల ప్రసక్తివల్లా, అతఃపూర్వము లేని ఒక వినూత్న ప్రయోగమైనందువల్లా, స్వల్ప కథాయుక్తమవటంవల్లా అలా అనిపిస్తోంది.

మేఘసందేశ కావ్యమొక్కటే కాళిదాసుకు చిర యశస్సునార్జించిపెట్టగల ఉత్కృష్ట కావ్యమని తద్విదుల అభిప్రాయం.

—డా॥ కె. వెంకటరావు

# తెలుగు - భోజ్‌పురి సంబంధంపై శ్రీ ఉపాధ్యాయ

శ్రీ సూర్యనాథ ఉపాధ్యాయ షష్టిపూర్తి అయిన నవ యువకుడు. అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా సుప్రసిద్ధులైన శ్రీ ఉపాధ్యాయ ఇటీవల ఆంధ్రరాష్ట్రంలో ప్రభంజనంలా పర్యటించి ఒక క్రొత్త ప్రతిపాదనను చేసి ఆంధ్ర పండితులు ఒకసారి మరలా ఆలోచించేలా చేశారు.

ఆ ఆలోచన పండితులకు ఈ రోజున్న సామాజికావశ్యకత దృష్ట్యా చాలా అవసరమైంది. భారతీయ భాషల్ని గత రెండు శతాబ్దులుగా పండితులు భాషా కుటుంబాల అన్వేషణ కోసమే చూస్తుండగా శ్రీ ఉపాధ్యాయగారు భాషల నడుమ సామ్యాలను గురించి అన్వేషించాలని తపన పడటం మనందరం ఆదర్శంగా గ్రహించదగిన మహాగుణం. ఏ సన్మానమూ, పదవీ ఆశించకుండా వీరు ఆంధ్రలో పలు జిల్లాలలో పర్యటించటం, దూరదర్శన్‌లో ఒక ఇంటర్వ్యూ ఇవ్వటం - ఆరోగ్యం అంత సుముఖంగా లేకున్నా వేలకొద్దీ కిలోమీటర్లు ప్రయాణించి తన భావాలను విస్తృతంగా ప్రకటించటం - చాలా ప్రశంసార్హమైన సాహసోపేత కార్యం.

ఈ ప్రతిపాదన వీరు చేయటంతో ఏ అకడమిక్ ప్రయోజనమూ లేదు. వీరు 1972లో తెలుగు నేర్చుకోవటం ప్రారంభించారు. అంటే దాదాపు 17 సంవత్సరాలుగా తెలుగుమీద నిరంతరానుశీలన చేస్తున్నారు. అంతేకాకుండా నారి ఏది పాపం! అనే నవలను 'క్యా హై పాప్?' అనే పేరిట హిందీలోకి అనువదించారు. ఈ గ్రంథం శ్రీమతి మహాదేవివర్మ, శ్రీ పి. వి నరసింహారావుగార్ల వంటి ఉద్దండుల ప్రశంసను పొందింది. భారతీయ భాషల మధ్య సమైక్యతను సాధించటంలో ఇలాంటి అనువాదాల ప్రాధాన్యం మనం చెప్పాల్సిన అవసరం లేదు. ప్రస్తుతం 'మాలపల్లి' నవలను అనువదిస్తున్నారు. వీరి వ్యాసాలు తెలుగు వాణి, సాహిత్య సమ్మేళన పత్రిక, హిందుస్తానీ పత్రికలలో అచ్చయ్యాయి. వీరి పరిశోధన తాత్పర్యం తెలుగు - భోజ్‌పురి హిందీ భాషల నడుమ ప్రాక్ చారిత్రక సంబంధాలున్నాయని.

వీరి ప్రతిపాదనల సారాంశం :

తెలుగు ద్రావిడభాష అని భాషా పరిశోధకుల తీర్పు. భోజ్‌పురి హిందీ మాండలికాలలో ఒకటి. ఆర్యభాష అని భాషా పరిశోధనలు నిరూపించాయి. కాని శ్రీ ఉపాధ్యాయగారు క్రింది అంశాలలో తెలుగు-భోజ్‌పురి భాషల నడుమ సాన్నిహిత్యాన్ని ఊహిస్తున్నారు.

1) తె. సిరు — భో. మార్ 'కొట్టు'
   సీటు — మార్హ్ 'తిను'

తెలుగులోని శకటరేఫ లాంటిదే భోజపురిలోని 'ర్హ్' అనే ధ్వని కూడా. ఇతర ఆర్యభాషల్లో ఈ ధ్వని లేదు.

2) తె. అమ్మాయి-లు (లు - బహువచనం).

హిందీ. లడ్‌కియాఁ / లడ్‌కీ చూ. భో. లడ్‌కిలో

భోజ్‌పురిలో కనిపించే 'లో' అన్న బహువచన రూపం తెలుగులోని 'లు' కి సంబంధించిందే.

3) తెలుగు ద్రావిడ భాషే అయినా పద నిర్మాణ నిష్పత్తి ప్రక్రియలో తమిళం కన్నా చాలా భిన్నమైంది. కాల్డ్‌వెల్ కాలం నుండీ ఈ అభిప్రాయం ఏదో ఒకవిధంగా వినిపిస్తూనే ఉంది. కొన్ని విషయాలలో ఈ రెండు భాషలమధ్యా ఉన్న

సంబంధం - ద్రావిడ భాషలే అయిన తమిళం - తెలుగుల నడుమ లేకపోవటం గమనించదగింది.

ఉదాహరణం 'తా' అనే వర్తమానార్థక ప్రత్యయం.

తె. పోతాయి — భో. జాతారు
పోతావు — జాయావ
పోతారా! — జాతారా!
పోతాను — జాతానీ'

ద్రావిడ భాషా పరిశోధకులు 'తా' అనే ప్రత్యయం తెలుగులో ఎలా ఏర్పడిందో సంతృప్తికరంగా వివరించలేకపోయారు. హిందీలో సహజంగా 'తా' పై రూపాలలో అన్ని మాండలికాల్లోనూ వుంది.

4) తద్ధర్మక క్రియలోనూ ఈ సామ్యం వుంది.
తె. ఆ అమ్మాయి పోతూ పోతూ పడిపోయింది.
భో. ఊ లయికీ జాత్ జాత్ గిరిగయిలే.
(చూ. హిందీ (పా) జాతే జాతే గిర్ గయి

5) పూర్వకాలిక క్రియను సూచించే - ఇ కారమూ సమానమే.
తె. వెళ్ళిపోయాడు
భో. చలి గయిలే (చూ. హిందీ. చలేగయా)

6) చేదర్థక రూపంలోనూ ఈ సామ్యం వుంది.
తె. అడిగితే
భో. పూఛితే

7) సహాయక క్రియల వాడుకలో కూడా ఈ సమానత ఆశ్చర్యకరంగా కనిపిస్తున్నది.
తె. మరచిపోతివి
భో. భూలి గయావి

8) కొన్ని పదాల అర్థ సగోత్రత చాలా గంభీరంగా ఆలోచించదగ్గది.
తె చిప్ప (ఇక నీ చేతికి చిప్పే!)
భో. ఛీప (చూ హిం. థాలీ)

పళ్ళెం కన్నా భిన్నంగా పాత్రలాగా వుండేది ఛీప - తెలుగులోని చిప్ప అన్న నానుడి వెనుక ఈ సాంస్కృతికార్థం వుంది.

9) తెలుగుని శాస్త్రీయ సమాధానాల్ని వెదకటం కోసం ద్రావిడ భాష అనటం ఎంత నిరర్థకమో, హిందీని ఇండో యూరోపియన్ అనుకోవటమూ అంతే అనర్థకం. భారతీయ భాషలు ఒక కుదురులోనుంచే పరిణమించి రూపాంతరాలు పొందాయి. అందుచేత ఈ భాషల నడుమ ఉన్న సామ్యాలు, భేదాలకన్నా బలవత్తరమైనవి.

10) ఆర్. సి. మజుందార్ (1951) గుర్తించినట్టు ఆంధ్రప్రదేశ్‌లో బయల్పడిన అశోకుని 13వ శిలాశాసనం విదర్భ, బీరార్‌ల మొదలు, ఆంధ్రదాకా ఉన్న మొత్తం ప్రాంతాన్ని భోజుల దేశమని వర్ణించింది. అందుచేత ఆ భోజులే ఈ ఆంధ్రులు - లేదా ఈ ఆంధ్రులే ఆ భోజులు. కాబట్టి ఆర్య-ద్రావిడ భేదపరిగణన అర్థవంతం కాదు.

పరిశోధకుల ప్రతిస్పందన :

శ్రీ ఉపాధ్యాయగారి ప్రసంగం విన్న పరిశోధకులకు చాలా అంశాలు ఆలోచింపదగ్గవిగా కనిపించాయి. చిలుకూరి నారాయణరావుగారు ఏ 1936 ప్రాంతాలలోనో తెలుగును ప్రాకృత భాషగా నిరూపించటానికి ప్రయత్నించిన దాదాపు అర్థశతాబ్దం తర్వాత తెలుగుని ఒక ఉత్తరాది భాషతో పోల్చిచూపిన ఈ దృష్టి కోణం ఆసక్తికరంగా అనిపించింది.

ఆచార్య ఎం. బి. ఎమెనో భారతీయ భాషలు ఒక బహుభాషా ప్రాంతాన్ని (లింగ్విస్టిక్ ఏరియా) ఏర్పరస్తున్నట్టుగా చాలాకాలం క్రితమే గుర్తించారు. ఇటీవలి దశాబ్దులలో ఉత్తరాది భాషలమీద, ఉత్తరంలో వ్యవహరించబడే ద్రావిడ భాషల మీదా చాలా పరిశోధనలు సాగాయి. ఫలితంగా చాలా ప్రాచీన కాలంలోనే ద్రావిడ - ఆర్య - ముండా - సీనో టిబెటన్ భాషా కుటుంబాల మధ్య అతి మౌలికమైన ఆదాన ప్రదానాలు జరిగాయని తెలుసుకొన్నారు. అందుచేత ఈనాడు ఈ విధంగా సమానతల్ని వెతికే ప్రయత్నం భారతీయ భాషల నడుమ అవగాహనను మరింత గాఢతరం చేస్తుందనడంలో సందేహం లేదు.

కొన్ని అంశాలలో శ్రీ ఉపాధ్యాయగారిని సంపూర్ణంగా అంగీకరించటమూ అసాధ్యమే. శకటరేఫ విషయంగా చాలా పరిశోధన సాగింది. దానికొక చరిత్ర వుంది. దంతమూలీయంగా ఉండిన ఒక స్పర్శవర్ణం కాలక్రమంలో కంపిత ధర్మాన్ని పొంది 'ఱ'గా మారిందని ద్రావిడ భాషలకే ఇది ప్రత్యేక ధ్వని అని ఇంతవరకూ పరిశోధకులంతా అంగీకరిస్తూ వచ్చిన అంశం.

వీరు గ్రహించిన ఉదాహరణం ఒకటే - ఇలాంటి ఉదాహరణలు చాలా లభించాలి. ఇతర మాండలికాలతో ఏదో ఒక సంబంధాన్ని స్థాపించగలగాలి. అప్పుడే ఈ అంశాన్ని గురించి ఆలోచించవచ్చు.

కాని వీరు క్రియా రూపాలలో చూపిన సామ్యాలు మాత్రం విజ్ఞంగా పునరాలోచించవలసినవే. ముఖ్యంగా చేదర్థకం, క్త్వార్థకం, సహాయక క్రియలు - వీటి వ్యాప్తిలో ఈ రెండు భాషల నడుమ సాన్నిహిత్యం ఎలా ఏర్పడ్డది?

ఈ నివేదకుడు బంజారా మాండలికాల మీద గత 13 సంవత్సరాలుగా పరిశోధన జరుపుతున్నారు. బంజారా మాండలికాలు ఇటు దక్షిణ దేశంలోనూ ఉన్నాయి. అటు ఉత్తరంలోనూ వున్నాయి మొత్తం భారతదేశమంతటా వ్యాపించిన ఒకే మాండలికంగా ఈ బంజారాల భాషను గుర్తించవచ్చు. ఇలాంటి భాషను గుర్తించాక నాకు తెలిసిన అంశాలు దాదాపు సూర్యనాథ ఉపాధ్యాయగారి భావాలకు చాలా సమీపంగా ఉన్నాయి. నిరంతర భ్రమణశీలమున్న జాతులు వ్యవహరించే భాషలలో ఇలా భిన్న భాషా కుటుంబాల సాహచర్యం కనిపిస్తుంది.

తెలుగు-ఆంధ్రగా మారటంలో ఎంతో గతి తర్కముంది. ఆర్య భాషల సంపర్కముంది. ఆంధ్రులు, భోజులు, వృష్ణులు-వీరంతా భారత భాగవతాలలో పేర్కొబడ్డారు. ఎక్కడ ప్రస్తావించినా వీరిని కలిపే ప్రస్తావించారు. ఆ దృష్టితో 'భోజాంధ్రకుల' చరిత్రను త్రవ్వి తీస్తే ఈ సామ్యాలకు మూలాలు తెలుస్తాయి. దీనికి శ్రీ ఉపాధ్యాయగారి ప్రసంగం ప్రేరణ కాగలదు.

—డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# నేటి సాహిత్య పాఠకులు-
## ఒక పరిశీలన

కాలం చాలా శక్తివంతమైంది. దాని గమనరీతి చిత్ర విచిత్రాత్మకం. సంభ్రమాశ్చర్యకరం. ప్రపంచంలోని ఏ వస్తువూ దీని ప్రభావం నుండి తప్పుకోజాలదు. బలీయమైన ఈ కాలం మనుషుల బుద్ధిని మార్చుకుంటూ మార్గం సుగమం చేసుకుంటూ వెళ్ళిపోతుంది. కవులు, కళాకారులు, శ్రోతలు, ప్రేక్షకులు, పాఠకులు, రచయితలు ఇత్యాది మానవులంతా కాలాన్ని అనుసరించి సాగవలసిందే

రచయితలు రెండు రకాలు : ప్రయోజనకర సాహిత్య రచయితలు, స్వప్రయోజనకర సాహిత్య రచయితలు. కవులు కూడా ఇందుకు భిన్నంగా లేరు. పాఠకులూ అంతే. కాలక్షేప సాహిత్యం కోసం నవలల్ని చదివే పాఠకులు కొందరైతే ప్రపంచ శ్రేయస్సును కాంక్షించే పురోగతి కోసం ఆక్రోశించే ఆవేదన చెందే రచనల కోసం ప్రతీక్షించి అట్టి కావ్యమో, కథయో, నవలో, నాటకమో రాగానే దాన్ని చూపి ఆనందించేవారు మరి కొందరు.

ప్రయోజనకర సాహిత్యం గురించి, ఆ సాహిత్య పాఠకులలో వస్తున్న మార్పుల గురించీ ఈ వ్యాసంలో వివరించదలచుకున్నాను. ఇక కాలక్షేపం కోసం వస్తున్న డిటెక్టివ్ మొదలైన నానా హంగామాల రచనల గురించి వాటి పాఠకుల గురించి నేను చర్చించదలచుకోలేదు. అందుకు కారణం అవి సాహిత్య విలువలను కోల్పోయి భ్రష్టత్వాన్ని పొందాయి గనక. వాటి పాఠకులు పఠితకు ఉండవలసిన కనీస సంస్కారాన్ని కలిగి ఉండక పోవటం శోచనీయం.

ఇవాళ ప్రయోజనకరమైన సాహిత్యానికి ప్రతీకగా కవిత్వాన్ని తీసుకొని కవిత్వ పాఠకులు ఏ విధంగా ఉన్నారో అనుశీలిస్తాను. చర్చాసౌలభ్యం కోసం కవిత్వము నొక్కదానినే ఎన్నుకున్నాను.

ఆధునికయుగ ప్రభావంవల్ల వాదోపవాదాలు, ఉద్యమాలూ రాజకీయ పక్షాలు క్రొంగ్రొత్తవి పుట్టుకొస్తున్నకొద్దీ సమాజంలో భిన్న భిన్న అభిప్రాయాలు గల వాళ్ళేర్పడుతున్నట్లే - ఆయా వాదాల, ఉద్యమాల కనుగుణమైన కవులు ఆవిర్భవించినారు. ముఖ్యంగా హేతువాద భావనల వల్ల సంఘంలోని ప్రతి అంశమూ చర్చకు గురైంది. ఇందువల్ల సంఘంలోని మానవునికి దేవునిమీదా విశ్వాసం లేకుండా పోయింది. చివరకు తనమీద తనకే నమ్మకం నశించి శూన్యస్థితిలోకి మానవుడు దింపబడినాడు. పఠితల్లోనూ ఈ శూన్యస్థితి అస్థిరత్వాన్ని, అస్పష్టతనూ, అవ్యవస్థనూ ప్రవేశపెట్టింది హేతువాదయుత ప్రవర్తనా సరళి. వీరు మరొకరి రచన చదవలేని, చదివినా ఆనందించలేనివారైనారు.

రాజకీయ పక్షాల కవులకు ఎంతసేపూ ఆయా పక్షాల ప్రచార విలువలనే పోషించవలసిన దుర్గతి పట్టింది. అందువల్ల భావదాస్యానికి భావదారిద్ర్యానికి గురైనారు. ఎంతసేపూ భౌతిక ప్రపంచం గురించీ అందునా కేవలము దీనుల గురించీ ఆయా పక్షాలు వేసే అడుగుల్ని కీర్తిస్తూ ఉండాల్సిన స్థితి ఒక రకంగా వారికి బలహీనతగా మారింది. కళా విలువలకు స్థానం ఇవ్వక పోవటంవల్ల వారి కావ్యాల్లో కవిత్వ శిల్పం లభివ్యక్తి చమత్కృతీ లోపించినందువ వారి కావ్యాలు అనాస్వాద యోగ్యములుగా మారాయి. అందువల్లనే పట్టుమని పదేళ్ళు నిండకుండానే కృతులు (ఆధునిక రాజకీయ సాంఘిక హేతువాదాత్మక కావ్యాలు)

కాలగర్భంలో కలిసిపోతున్నాయి. దినపత్రికల నాశ్రయించవల సిన అగత్యం ఆయా కవులకూ కావ్యాలకూ కలుగుతూండటం అగద్విదితమే. అందువల్ల వాళ్ళు రాసుకున్న కవిత్వం వాళ్ళ వరకే ఆనందాన్ని కలిగించవచ్చునేమో! అంటే వీరి కావ్యాల్ని వేరేవారు పఠించరు.

హేతువాద ప్రభావమైతేనేమీ, రాజకీయపక్షాలపట్ల మొగ్గు చూపడమైతేనేమీ పఠితలోని సహృదయ లక్షణాన్ని దెబ్బతీసింది. ఇందువల్ల కవిత్వంపట్లనే కాకుండా నాటక నవలాది ఇతర ప్రక్రియలపట్ల కూడా పాఠకుల ప్రేక్షకుల దృష్టిలో మార్పు వచ్చింది. ఉదాహరణకు ఒక కవి సమ్మేళనం జరుగుచున్నదను కుందాం. సందర్భము తెలుగు సంవత్సరాది. దాదాపొక యేబది మంది కవులు కాస్త ప్రముఖులు వస్తే అందులో దాదాపు ఒక పదిమంది అయినా వాదరహిత నినాదరహిత కవివరులుంటే వాళ్ళ కవిత్వాన్ని వినడానికి మిగతా నలుబదిమందీ తలనొప్పిగా భావి స్తారు. శ్రోతల్లోని ఎక్కువమందీ అదేవిధంగా మొహాలు మాడ్చే స్తారు. ఆ శ్రోతలలోనూ కొంతమంది దిగిపొమ్మని అనకుండా చప్పట్లు కొడతారు. మరికొంతమంది అటూ ఇటూ ఇబ్బందిగా కదులుతారు. వీళ్ళలో ఎవరెవరి గోత్రీకులు వచ్చి వేదికమీద కవిత వినిపిస్తారో వాళ్ళ వాళ్ళ పాఠకులే హృదయపూర్వకంగా స్పందిస్తారు. అంటే పఠితయొక్క మనోభావమూ పట్టి యాంత్రి కమైపోయిందన్నమాట. ఇది భావ కాలుష్యం తెచ్చిన దౌర్భాగ్య లక్షణం. పఠితకు పరనస్వేచ్ఛ లేదనే దీని అర్థం. ఇతర వాదుల, పక్షీయుల లేదా కవుల కావ్యాలను ఆస్వాదించ లేకపోవటానికి కారణం పఠిత కూడా పరిధిని నిర్ణయించుకొని ఎంతసేపూ అందు లోనే చక్రభ్రమణం చెయ్యడం జరుగుతున్నది. ప్రతి వస్తువునూ పరిశీలించి ప్రతి భావాన్ని గ్రహించి ప్రతి విశేషాన్ని ఆస్వాదించే లక్షణం కోల్పోవటం కావ్యపాఠకుల సంఖ్య తగ్గటానికి మూల కారణం.

విమర్శక లక్షణం కలిగిన ఏ పక్షానికి చెందిన పాఠకుడో రకరకాల కావ్యాలను చదివాడనుకుందాము తనకున్న ఒక దృష్టి తోనే ఆయా కావ్యాల మంచి చెడులను అంచనా వేస్తాడు. అంటే కావ్యం ఆరంభించకముందే దానిపై ఒకరకమైన ఉద్దేశ్యం ఏర్పడి ఉంటుంది. ఎదుటిపక్షపు కావ్యమనో లేక సామాజిక తత్త్వం లేని కావ్యమనో ముందే అభిప్రాయం కలిగి ఉండటంవల్ల - ఆ కావ్యంలో ఉన్నది ఏమిటో గ్రహించలేకపోతాడు పైగా లేనిదాని కోసం వెతికి వివలుడై కావ్యాన్ని నిందిస్తాడు. తనకున్న కళ్ళద్దాలు పచ్చవైతే లోకమంతా పచ్చదేనన్నమాట. సహృద యత లేనివాడు సద్విమర్శకుడు కాలేడు. అందుకే జి. వి. సుబ్రహ్మణ్యంగారు 'శ్రీ సిధారెడ్డి రచన అనుభూతివాద ద్వేషుల సమీక్షకు చక్కని ఉదాహరణ' అన్నారు. ఆ విమర్శకుని గురించి సుబ్రహ్మణ్యంగారలా అభిప్రాయపడడానికి కారణం సహృద యత, ఋజుప్రవృత్తి విమర్శకునిలో లోపించడమే. దీన్నిబట్టి తెలిసేదేమంటే ఎవరి దృక్పథం వారికున్నా విమర్శ చేసేటపుడు మాత్రం నిష్పాక్షిక వివేచనాశీలం అవసరమనీ ఎదుటివారి దృక్ప థాలూ గౌరవనీయాలేననీ. ఇట్లాంటి గుణగణాలు సాధారణ పాఠకుల్లో లేనట్లే కవులలో లేనట్లే విమర్శకులలోనూ లోపించటం విచారకరం.

శ్రీ నందిని సిధారెడ్డి 'ఆధునిక కవిత్వంలో అనుభూతి కవిగా మొట్టమొదటి కవి తిలక్. ఈ అనుభూతి దృష్టి కొలను లాగా అక్కడే ఉండిపోయింది తప్ప ఇది ప్రవహించలేదు. దిగంబర కవుల షాక్ ట్రీట్‌మెంటూ, విప్లవకవుల ప్రభంజనం సమాజాన్ని కుదిపింది. కవిత్వాన్ని కదిలించింది' అంటూ అనుభూతి కవిత్వం ఎంతమాత్రం ప్రయోజనకారి కాదంటూ, శ్రీకాంతశర్మను, శేషేంద్రనూ, వేగుంటనూ, ఇస్మాయిల్‌నూ అధిక్షేపిస్తూ రాశాడు. ఈ కారణంగా జి. వి. సుబ్రహ్మణ్యంగారు ఆక్షేపణ తెలిపారు.

శేషేంద్ర విమర్శకునికి ఉండవలసిన లక్షణం గురించి ఈ విధంగా అంటున్నారు. 'విమర్శకుడు కావ్యాన్ని ఒక వినీత మనస్కుడై చేరాలి. దాని ప్రభావానికి లొంగుదామన్న కోమల సంకల్పంతో చదవాలి. రంధ్రాన్వేషణ కోసం చదివేవాడు సాహిత్యేతర కిల్బిషం చేత కలుషితుడు'. ఇది ఒక ఉదాహరణం మాత్రమే. ఇలాంటి సందర్భాలు ఇంకా ఎన్నో ఉంటాయి.

అంతేకాదు కావ్యవిమర్శ కావ్యాన్ని ఆస్వాదించడమే గానీ వాదించడం కాదనీ బల్లగుద్ది చెప్పేవాడు శేషేంద్ర. సాహిత్యేతర కిల్బిషం అంటే కవిత్వేతర వస్తుసంబంధ భావనలే. అవి కలిగి ఉన్నవాడికి సద్విమర్శ దుర్లభం. ఎందుకంటే అతనికి వినీత మనస్సు లేదు గనుక. వాదాల ఉద్యమాల మూలంగా సహృద యాన్ని కోల్పోయిన పాఠకులు మళ్ళీ సుమనస్కులైతే తప్ప సాహిత్యానికి నిండుదనం చేకూరదు. విమర్శకుడు అవశ్యం సహృదయుడవాలి.

—పాతూరి రఘురామయ్య

# గ్రంథ విమర్శలు

## విజ్ఞానశాస్త్ర విచిత్రాలు

[రచన : డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు, ప్రచురణ: శ్రీ ధనలక్ష్మి పబ్లికేషన్స్. షేక్ జానీ వీధి, ఏలూరు రోడ్, విజయవాడ-520 002. వెల: రు 20/- 1/8 క్రౌన్ సైజు, పుటలు 170.]

బహుముఖంగా వికసిస్తున్న "విజ్ఞాన శాస్త్రాలు" ఎంత సంచలనాన్ని కలిగిస్తున్నాయో అందరికీ తెలిసిందే. ఇదే విషయాన్ని డా॥ రమేష్‌బాబుగారు పిల్లలకు, పెద్దలకు అర్థమయ్యేలాగా ఎంతో ఆసక్తికరంగా "విజ్ఞానశాస్త్ర విచిత్రాలు" అనే పుస్తకంలాగా మలిచారు. ఎన్నో విశేషాలు ఉన్న ఈ పుస్తకం మన రాష్ట్ర ప్రభుత్వంవారి సైన్స్ స్కీమ్‌లో సెలక్ట్ అయింది.

ఆకాశంలో వ్యవసాయం చేయడం, సముద్రంలో సేద్యం చేయడం, హృదయాలను మార్చడం, మూత్రపిండాలను సైతం సరిచేయడం, లివర్ మార్పిడులు, బ్రెయిన్ మార్పిడులు - ఇలాంటివి తలచుకొంటూ ఉంటేనే ఆశ్చర్యం వేస్తుంది. ఇవన్నీ నమ్మశక్యం కాని వాస్తవాలు. సైన్స్ రూపొందించిన అద్భుతాలు.

టెస్ట్‌ట్యూబ్ బేబీలు, టెస్ట్‌ట్యూబ్ మొక్కలు, స్పేస్ స్టేషన్‌లు, కంప్యూటర్ రోబోలు - ఇలాగా ఎన్నో రకాల విచిత్రాలు మనముందు నేడు కనిపిస్తున్నాయి. బయోటెక్నాలజీ, లేసర్ టెక్నాలజీ, టెలిఫోన్ టెక్నాలజీ, నానో టెక్నాలజీ మొదలైన వాటిగురించి చెప్పనే అక్కరలేదు.

ఆ విధంగా విజ్ఞానశాస్త్ర విచిత్రాలు ఎన్నో ఎన్నో ఉన్నాయి. వీటి గురించి సంక్షిప్తంగా, సమగ్రంగా పాఠకులకు అందించడంలో రచయిత శ్రద్ధ శ్రమ ఫలించినట్లే చెప్పవలసి వస్తుంది. స్టార్‌వార్స్ గురించి మరింత సమాచారం ఇచ్చి ఉండవలసింది. తరువాతి ముద్రణలో ఈ విషయం గురించి ఆలోచిస్తారని ఆశిస్తాము.

## మనిషి ఎలా పుట్టాడు?

[రచయిత: డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు, ప్రతులకు: శ్రీ విజయలక్ష్మి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, హెచ్.ఎం.టి షోరూమ్ ఎదురుగా, విజయవాడ 520 002 1/8 క్రౌన్ సైజు, పుటలు-162. వెల: రు. 20/-లు.]

ఈ పుస్తకంలోని ముందుమాట అత్యద్భుతంగా ఉంది. పరిణామ వాదానికి డార్విన్ చూపిన సాక్ష్యాధారాల గురించి విపులంగా తెలుపుతూనే డార్విన్ సిద్ధాంతంలోని లోపాలను కూడా ఎత్తి చూపడం జరిగింది. పరిణామవాదంపై చర్చావేదిక కూడా ఈ పుస్తకంలో ఉంది ఇది ఎన్నో అనుమానాలను నివృత్తి చేస్తుందనడంలో సందేహమే లేదు. పరిణామం సంగతి అటుంచి మునుముందు మనిషి ఎలా పుట్టింది ఆరమవిశేషన్న కొత్త సాక్ష్యాధారాలు కూడా ఈ పుస్తకంలో చేర్చబడ్డాయి. మనిషి మనిషిగా ఎలా పుట్టి ఉంటాడో ఆలోచించమనే ప్రశ్నతో పుస్తకం మొదలు కావడం సందర్భోచితంగా ఉంది.

డార్విన్ సిద్ధాంతం విశిష్టతను వెలిబుచ్చడంలో ఎంత ఔదార్యాన్ని ఔచిత్యాన్ని రచయిత ప్రదర్శించారో అంతకు ఏమాత్రం తగ్గకుండా డార్విన్ వాదం హేతుబద్ధం కాదని కూడా నిర్భీతంగా తెలిపారు. ఇలా రెండు ధ్రువాలనూ స్పృశించడం, సంయమనం కోల్పోకుండా రచన చేయటం - గొప్ప విషయంగానే చెప్పాలి.

డా॥ రమేష్‌బాబు శాస్త్ర రచనలు చేయడంలో చెయ్యి తిరిగినవారు. వారు రాసిన ఈ పుస్తకం రాష్ట్ర ప్రభుత్వంవారి సైన్స్ స్కీమ్‌లో సెలక్ట్ కావడం అభినందించదగ్గ విషయం.

మనిషి శరీరం ఎంత విచిత్రమైందో, గర్భస్థ పిండం ఎంత గడుసుదో మొదలైన వివరాలు కూడా ఈ పుస్తకంలో ఉన్నాయి. చదివి చదివించదగ్గ పుస్తకం

## కేన్సర్! కేన్సర్!!

[రచయిత డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు, ప్రతులకు: శ్రీ ధనలక్ష్మి పబ్లికేషన్స్, షేక్ జానీ వీధి, ఏలూరు రోడ్డు, విజయవాడ 520 002. పుటలు-144. 1/8 క్రౌన్ సైజ్, వెల: రు. 20/-లు.]

కాన్సర్ అనే పేరు ఎవరూ వినకుండా ఉండరు. అదొక కొరుకుడు పడని వ్యాధి. ఈ వ్యాధి వస్తేనే చాలు భయంతో కన్నుమూసేవారు చాలామందే ఉన్నారు. ఈ వ్యాధి బాగా ముదిరి

పోతే చావు తప్పదేమో కాని లేత దశలోనే ఉండేదానిని తేలిక గానే నయం చేసుకోవచ్చు. ఈ వ్యాధి ఎందుకు వస్తుంది? ఎలా వస్తుంది? ఎవరికి వస్తుంది? ఎలా పరిణమిస్తుంది? మొదలైన రకరకాల ప్రశ్నలకు సమాధానమే డా॥ రమేష్‌బాబు రాసిన కాన్సర్! కాన్సర్!! పుస్తకమని సందేహం లేకుండా చెప్పవచ్చు మాంసాహార భక్షణం వల్ల, మద్యపానం వల్ల, ధూమపానం వల్ల, మాదక ద్రవ్యాలను సేవించడంవల్ల విచ్చలవిడి వ్యభిచారంవల్ల, విపరీత మైన మందుల వాడకంవల్ల, పరిసరాల కాలుష్యంవల్ల, విష రసాయనికాల ప్రభావం వల్ల, వైరస్‌లవల్ల, రేడియేషన్‌వల్ల, జన్యుదోషాలవల్ల వంశపారంపర్యంగా - ఇలా ఏ విధంగానైనా కాన్సర్ రావచ్చునని వింటుంటే ఆశ్చర్యంగా ఉంటుంది. కాన్సరుకు వయోభేదం కాని, లింగభేదం కాని అడ్డు కాదు.

కాన్సర్ ఎలా వచ్చినా ప్రస్తుతం దానిని ఎదుర్కోలేని స్థితిలో మాత్రం లేము. కాన్సర్‌కు కారణం తెలిస్తే చాలా నయం చేయడం సులభమే. ఇలాగ కాన్సర్ గురించి ఎంతయినా చెప్పవచ్చు. ఈ పుస్తకంలో డా॥ రమేష్‌బాబు చాలానే చెప్పారు.

ప్రతివారూ చదువదగ్గ పుస్తకం ఇది. భద్రంగా దాచుకో వలసిన మంచి పుస్తకం. అందుకే ధాత్రి ప్రభుత్వంవారి సైన్స్ స్కీమ్‌లో సెలెక్ట్ అయింది కేన్సర్! కేన్సర్!! అనకుండా కాన్సర్, కాన్సర్ అని ఉంటే బాగుండేది.

— శ్రీ వంశీ



## క్రాస్ చెకప్

[కథల సంపుటం. రచన పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, ప్రతులకు: రచయిత పేర, ఖమ్మం-4. పుటలు 328+26. వెల: రు. 36/-లు.]

ఈనాటి సమాజ జీవితం సౌందర్య విలసితమైన త్రివర్ణ చిత్రంలా లేదు. వసివాడు గీచిన పిచ్చిగీతల సముదాయంలా వుంది. ఈ విషయాన్ని 'ఆదిత్యశ్రీ' అన్న కథానికలో రచయిత శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు చెప్పవలసినంత స్పష్టంగా చెప్పారు. గ్రంథాలయం మేడపైన సభ జరుగుతోంది. అది దేన్ని గురించిన సభో సభికులకు తెలియదు ఎందును గురించి మాట్లాడాలో ఉపన్యాసకుడికి తెలియదు. ముఖ్యఅతిధి గాఢనిద్రలో వున్నాడు అధ్యక్షుడు సభలో లేడు. ఉపన్యాసకుడు ఆలోచించిన తర్వాత మాట్లాడ్డం లేదు, మాట్లాడుతూ ఆలోచిస్తున్నాడు పరిద భీభత్సాలు, భూకంపాలు, పంజాబు సమస్య, ఆహార ధాన్యాల అవసరం, పత్తిరైతుల ఆత్మహత్యలు, వ్యవసాయ కూలీల బాధలు, రష్యాలో కార్మిక విజయం, ఆంధ్ర సాహిత్య వైభవం, క్రికెట్టు యిలా రకరకాల అంశాలపైన శాఖా చంక్రమణం చేసు కుంటూ వచ్చి ఏ పాదికా పారక పోవడంవల్ల చివరికు గాడిదలా, కుక్కలా, పిల్లిలా అరవడం ప్రారంభించి సభికుల కరతాళ ధ్వనులను చూరగొంటాడు. ఉపన్యాసకుడికి, శ్రోతలకు మధ్య మాత్రమే గాదు, గురుశిష్యులకు మధ్య పాలకపాలితులకు మధ్య, రచయితకు పాఠకులకు మధ్య, సినిమా తీసే వాళ్ళకు చూసేవాళ్ళకు మధ్య ఈనాటి వ్యవస్థలో సంబంధ [illegible] [illegible] యున్నది [illegible] తరార్థ[illegible] [illegible] ఎటో బాలపై [illegible] ఈ రచయిత ప్రయోగించిన పరిహాస బాణం '[illegible] చెకప్'. ఒక సామాజిక [illegible] వ్యం[illegible] 'లంచం' మనుషులలోని మంచితనానికి నిదర్శనం 'బడ్డీకొట్టు [illegible] బ్రహ్మ' భార్యా వియోగి దుఃఖగాథ 'చుక్కెదురు' ఉద్యోగాన్వేషణ ఫలించక ఆత్మహత్యకు పాల్పడాలనుకునే విద్యార్థులకు, పెళ్లి సంబంధం కుదరక హతాశులయ్యే తల్లిదండ్రులకు [illegible] లేదని నిరూపించే కథ 'వక్రించిన పరిస్థితులు' భారతీయ

స్వాతంత్ర్య సమరగాథనంతా త్రవ్వి తలకెత్తిన దేశభక్తుడి కథ. 'అంతరాత్మ ప్రబోధం'. ఇలాంటివీ సంపుటంలో పదునాలుగు కథలున్నాయి. వెంకటేశ్వర్లుగారు జీవితంలో అనుభవాలు పండించుకున్నవారు. అందువల్ల వస్తువుతో పేచీ లేదు. ఎటొచ్చీ కొన్ని కథలు చదువుతుంటే వీటిని వేరొక విధంగా చెప్పివుంటే బాగుండేదేమో ననిపిస్తుంది. ఇది శిల్పానికి సంబంధించిన విషయం.

## ఎర్ర జెండాలు

[రచన : గంగినేని వేంకటేశ్వరరావు, ప్రచురణ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, ప్రతులకు: 'విశాలాంధ్ర'వారి ఏ బ్రాంచికైనా రాయవచ్చు. పుటలు - 850 వెల: రు. 40/-లు.]

భూస్వాములకు వ్యతిరేకంగా జరిపిన గెరిల్లా పోరాటంలో సైనికుల్ని, పోలీసుల్ని ఎదిరించి, అనేక కష్టనష్టాలకు గురై నిండు జీవితాలను ఉద్యమానికి బలిదానం గావించిన తెలంగాణా యోధుల జీవితగాథల సంకలనానికి రచయిత గంగినేని వేంకటేశ్వరరావుగారు 'ఎర్ర జెండాలు' అని పేరు పెట్టారు. 1947 నుంచి 51 వరకు జరిగిన ఈ పోరాటంలో నాలుగు వేల మంది కార్యకర్తలు మరణించినట్టు లెక్క. దాదాపుగా ఈ పోరాటం జరుగుతున్న రోజుల్లోనే తెలంగాణా పల్లెసీమల్లో పర్యటించి రచయిత ఈ జీవితగాథల్ని సవివరంగా సేకరించారు. సవిస్తరంగా రచించారు. ఈ పుస్తకానికి 'మృత్యువుపైన సమరం' అన్న పేరుతో రచయిత రచించిన పీఠిక 'దేశ స్వాతంత్ర్యం కోసం రైఫిల్ పట్టినవాణ్ణి చూస్తే నాకు శివమెక్కుతుంది. ఎవరైనా వీణ్ణి నిర్వచించమంటే 'దేశం కోసం రైఫిల్ పుచ్చుకున్నవాడే వీరుడు వీరుడ'ని వేయి గొంతుకలతో ఎలుగెత్తి చెబుతాను' అన్న వాక్యాలతో ప్రారంభమవుతుంది. చివరివరకు ఇంతటి ఆవేశంతోనే ఈ రచన కొనసాగించటం సాధ్యమా అని కొందరికి తోచవచ్చు. సాధ్యమే ననిపించారు గం. వేం. గారు. ఈ రచన ఆద్యంతం ఉరకలెత్తే మహా ప్రవాహంలా పరుగులు తీస్తుంది. 1. విప్లవకారుడు విద్రోహంలో కాదు పోటీపడేది; ఆత్మార్పణలో, అఖండ త్యాగంలో, అపూర్వ సాహసంలో, అద్వితీయ శౌర్యంలో పోటీపడాలి 2. మృత్యువును గ్రోలడం విప్లవకారుడి ధర్మం. మృత్యువు అతనికి మంచినీళ్ల ప్రాయం. 3. విశాలాంధ్ర శిరస్సు తెలంగాణా. తెలంగాణా గుండె నల్లగొండ. నల్లగొండ జిల్లా జీవరక్తం సూర్యాపేట. సూర్యాపేట సమరసింహం ఇరవైయ్యేళ్లు సరిగ్గా నిండీ నిండని అనిరెడ్డి రామిరెడ్డి. అందుకే అతడు నాకు ఆప్తుడు. నీకు ఆత్మీయుడు. నేను రాస్తూ ద్రవిస్తున్నాను, నీవు చదువుతూ ద్రవిస్తున్నావు. అతడు చెబుతూ చెమ్మగిల్లుతున్నాడు, ఆమె వింటూ కరుగుతూంది.... ఇలాంటి వాక్యాలు చదువుతుంటే ఒడలు జలదరిస్తుంది. 1 రాత్రి కుండపోతగా కురిసింది మబ్బు. 2 గొర్రెల్ని తినే వాళ్ళని వెళ్లగొట్టి బర్రెల్ని తినేవాళ్లు ఊళ్ళపైన పడ్డారు. 3. పెల్ల చేనుగులాగా కల్లం పెడుప్ప కాలాడు రామిరెడ్డి. ఇలాంటి నుడికారపు సొంపులతో, సమయోచితమైన ప్రకృతి వర్ణనలతో ఈ వీరగాథలకు గం. వే. గారు సాహిత్య గౌరవం కలిగించారు.

ఆలవాల నరసింహారెడ్డి, గొల్ల లింగయ్య, బారెడ్డి సైదులు, చంద్ర రామకోటయ్య, సోయం గంగులు, యిలా ఎందరో వీరులు దళం ఆచూకీ తెల్పడానికి నిరాకరించిన నేరానికి ఘోరాతిఘోరమైన చిత్రహింసలకు లోనై మరణించారంటే ఎంతో బాధగా వుంటుంది. ఇంతకూ ఈ మారణకాండ దేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత యూనియన్ బలగాల ద్వారా జరిగిందంటే అది సిగ్గుపడవలసిన విషయం. ఆ విషయం అలా వుండగా రచయిత గం. వేం. గారికి కమ్యూనిస్టు పార్టీపైన, విప్లవోద్యమాల పైన, సాయుధ పోరాటాలపైన అచంచలమైన నమ్మకం మామూలు పాఠకులకు విభ్రాంతిని కలిగిస్తుంది. 'ప్రపంచంలో దేనినైనా ఎదిరించండి. ఎవరితోనైనా పోరాడండి కానీ కమ్యూనిజానికి ఎదురు తిరగొద్దు. దీనికి భిన్నంగా ప్రవర్తించారా అపజయం తప్పదు. ఇంకా పిచ్చిగా కత్తిగట్టారా సర్వనాశనం తథ్యం. ఇది చరిత్ర చెప్పే పాఠం. ఆ పార్టీని జయించాలని భ్రమపడటం సముద్రాన్ని పూడ్చాలనుకోడమే' అని ఎలుగెత్తి నినదించారు గం. వేం. గారు. 'తెలంగాణా విముక్తి మాత్రమే గాదు, ప్రపంచ భవిష్యత్తు గూడా అఖండ త్యాగమూర్తి ఐయిన కమ్యూనిస్టు పార్టీపైన ఆధారపడి'వున్నట్టు ఆయన అభిప్రాయ పడ్డారు. ప్రపంచ భవిష్యత్తు సంగతేమైనా, తన భవిష్యత్తును గురించి కమ్యూనిస్టు పార్టీయే పునరాలోచనలో పడిన ఈ సందర్భంలో, ఒక కలం పోటుతో చేయదగ్గ భూసంస్కరణల కోసం, ఇందరు వీరుల ఆత్మార్పణ ఎంతవరకు అర్థవంతమన్నది మరీ మరీ ఆలోచించవలసిన విషయం.

— మధురాంతకం రాజారాం

## శ్రీ మృత్యుంజయ శతకము

[రచన : శ్రీ వరిటి సూర్య సుబ్రహ్మణ్యం, ప్రతులకు: శ్రీ కర్రా ఈశ్వరరావు, 2-14-130/2, శ్యామలానగర్, గుంటూరు-6, మూల్యం: రూ. 6/-లు.]

భక్తి ప్రపత్తి అంతరించుకుపోతూన్న కాలంలో అక్కడక్కడ చిగుళ్ళు కనిపిస్తూ ఉంటాయి. ఎంత కలియుగమైనా సర్వశూన్యం అని అనడానికి వీల్లేదు - అని యిలాటి కృతులు చెప్తూ ఉంటాయి.

ఈ మృత్యుంజయ స్తుతి చక్కని ధారతో, చిక్కని పద సరళితో మృత్యుంజయుణ్ణి వశపరచుకుంటూన్నది. ఆనాటి శివ భక్తుల సంస్మరణతో మృత్యుంజయ తత్వమును ప్రదర్శిస్తూంది.

సాహితీ బంధువు శ్రీ కర్రా ఈశ్వరరావుగారు జ్యేష్ఠ పుత్రునికి మృత్యుంజయుని దయ కలిగించడానికి సంకల్పించి దీనిని ముద్రింపించి వెలుగులోకి తెచ్చి కృతార్థులయారు.

పేరు గల పెద్దలు కొందరు ఈ కృతికర్తను ప్రశంసిస్తూ దీవిస్తూ అభిప్రాయాలిచ్చారు. కనుక నేను వేరే ఏమీ చెప్ప నక్కరలేదు.

అక్కడక్కడ యతులను సవరించవలసి ఉంది. (5, 62, 63. 66, 69, 102, 104 - పద్యాలలో) 20వ పద్యములో 'మెరిలివి' - అనే క్రియకి బదులుగా 'ప్రమింగితివి' - అని సవరిస్తే అనడానికీ వినడానికీ సముచితంగా ఉంటుంది. 31, 32, 33 సంఖ్య గల పద్యాలు శ్రీ సుబ్రహ్మణ్యం నీతికీ నిజాయితీకీ, మనోధైర్యానికీ అక్షర రూపాలని ప్రశంసిస్తున్నాను.

## సూక్తి ముక్తావళి

[రచన: శ్రీ వసంతరావు వేంకటరావు, ప్రతులకు: శ్రీమతి ఎస్. బ్రహ్మయమ్మ 453-బి, యం. యస్ యన్ కాలనీ, జ్ఞాన పురి, విశాఖపట్నం 4, అమూల్యం]

'వసంతరావు' అనగానే 'వేంకటరావు' - అ మాత్రం ఈ మాత్ర చదివినవాం ఎదలో స్ఫురించే వైజ్ఞానిక శిరోరత్నం వేంకటరావుగారు విజ్ఞానశాస్త్రం అనగా కొందరికి అజ్ఞానం పల్లవిస్తోంది. కొందరికి నమ్మం, కొందరికి విస్మయం కలగడం [illegible] ఏదో మనమును పోగొట్టి నియమమునూ, వినయమూ పుష్టిగా తుష్టిగా కలిగించే విజ్ఞానసూత్ర బోధకుడూ [illegible] వేంకటరావుగారు. [illegible] వార్ధికమైన 'తెలివి' [illegible] నిర్ణయం కాదనలేరు.

ప్రకృతి, శక్తి, పరమాణువు, అణువు, విద్యుత్తు, నక్షత్రం, సూర్యుడు, భూమి - పరిభ్రమణం - అయస్కాంతం - పాలపుంత - ఆత్మ సంయమనం - స్వార్థత్యాగం - ధ్యానం, మౌనం - గురుశిష్య సంబంధం, విద్య, భారతీయ సంస్కృతి - ఆదర్శ మానవత - అనే విషయాలను గూర్చి ఇరవై యొక్క సంఖ్యతో వేంకటరావు సంతరించిన యీ ముద్దుల సుద్దుల ముత్తెపుదండ ఎల్లరకూ సర్వదా కంఠహారమై ఉండదగినది.

వ్యాసుడు, ఆదిశంకరుడు, భర్తృహరి, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, నచికేతుడు, ఏకలవ్యుడు, కుచేలుడు - ఈ సూక్తులలో దర్శనమిస్తారు. రాధాకృష్ణ పండితుని మాటలకు వేంకటరావుగారి వ్యాఖ్య ఉపనిషద్వివేచన అని పఠనీయం.

—యామిజాల పద్మనాభస్వామి

## భూమి పుత్రుడు

[రచన: మందాడి కృష్ణయ్య, వెల: రు. 5/- ప్రతులకు: మందాడి కృష్ణయ్య, స్టూడియో చిత్రలేఖ, సునంద హోటల్ ఎదురుగా, చిక్కడపల్లి, హైదరాబాద్-500 020]

మానవత్వం ప్రధానంగా కవిత్వం చెపుతున్న మందాడి కృష్ణయ్య 'భూమి పుత్రుడు'లో భావం చాలా సూటిగా చెప్పటం జరిగింది. ఇటీవలి కాలంలో వస్తున్న కవిత్వాల్లో సొంత గొంతు వినిపించకపోవటం ముఖ్య లోపంగా ఉంది. ఈ కవి సొంత గొంతుతో పలకటం సంతోషించదగిన విషయం.

'తన కలాన్ని కన్నీటిలో ముంచి' కవితలు రాస్తున్న ఈయన ఈ దేశంలో జరుగుతున్న దోపిడీ గురించి, నిరుద్యోగ కోరల్లో చిక్కి ఆకలికి తాళలేక ఆర్సెనిక్ తిన్న యువత గురించి, ఎండ్రిన్ గ్లాసు పట్టిన ఉష్ణకాసార కష్టజీవి గురించి, నాగుల లేస్తున్న నాగరి గురించి కుటిల ప్రజాస్వామ్యానికి సాక్షిగా నిలిచిన మెయిలు గురించి వివరిస్తూ, వీటన్నిటికి పరిష్కారంగా బ్రద్దలయే అగ్నిపర్వతంలా, సముద్రంలో తుఫానులా, విప్పారు వెదజల్లుతుండ విప్లవం అంటూ హెచ్చరించాడు. అంతేకాదు ఆ విప్లవాల యుగంలోనే ప్రజా విజయాల పరంపర ఉందనే సత్యాన్ని స్పష్టం చేశాడు.

మందాడి కృష్ణయ్య కవిత్వంలో స్పష్టమైన శైలి, బిగువు సరిగా లేకపోయినప్పటికీ అందరికి సూటిగా అర్థమయ్యే భావం వల్ల పాఠకుడ్ని ఆకట్టుకుంటుంది

— కృష్ణచైతన్య

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247